

ఫిల్మ్‌నగర్

# ట్వింకిల్ ట్వింకిల్ 'లిటిల్' స్టార్!

'స్టార్' హీరో, 'స్టార్' హీరోయిన్లే కాదు... 'స్టార్' చైల్డ్ ఆర్టిస్టులు కూడా ఉంటారు. కొన్ని సినిమాలకు వారే స్పెషల్ అట్రాక్షన్‌గా నిలుస్తుంటారు. ఉదాహరణకు 'బజరంగీ భాయ్‌జాన్'ను ముద్దులొలికే హర్షాలీ మల్హోత్రా లేకుండా ఊహించగలమా? 'ఐయామ్ కలామ్'లో హర్షా మయర్ నటన చూస్తే ఎవరైనా ఫిదా కాకుండా ఉంటారా? 'కిక్', 'పిజ్జా' సినిమాల్లో నటించిన చిన్నారి దియా చల్వద్‌ను ఇప్పట్లో ఎవరూ మర్చిపోరు. ఐశ్వర్యారాయ్ 'జస్బా'తో పాటు తెలుగులో కూడా మెరిసిన సారా అర్జున్ ప్రస్తుతం ఇర్ఫాన్‌ఖాన్‌తో ఒక హాలీవుడ్ మూవీలోనూ నటిస్తోంది. 'బ్రదర్స్', 'ప్రేమ్ రతన్ ధన్ పాయో' సినిమాలతో లిటిల్ స్టార్‌గా ఎదిగిన ధృవకుమార్ చేతినిండా సినిమాలతో బిజీగా ఉన్నాడు. వీళ్లంతా ప్రస్తుతం బాలీవుడ్‌లో టాప్ 5 చైల్డ్ ఆర్టిస్టులుగా అత్యధిక పారితోషికాన్ని అందుకుంటున్న వారు. రేపు 'చిల్డ్రన్స్ డే' సందర్భంగా వీరందరికీ ఒకసారి 'హాయ్' చెబుదాం.



హర్షాలీ

హర్షా



దియా



ధృవ



సారా

## ఇండెక్స్




ఆదివారం ఆంధ్రజ్యోతి
13 నవంబర్ 2016


## ఇన్‌బాక్స్

### దీపావళి శోభను పెంచింది

**దీ**పావళి రోజున వచ్చిన కవర్‌స్టోరీ 'దీపావళి.. ఆనందావళి' పండుగ విశిష్టతను తెలియజేసింది. మన పండుగలు ప్రపంచమంతా వ్యాపించడం గర్వించదగ్గ విషయమే. కాని దేశ,విదేశాల్లో జరుపుకునే ఈ దీపావళి 'ఫెస్టివల్ ఆఫ్ లైట్స్'గా పేరు గాంచిందే తప్ప, 'ఫెస్టివల్ ఆఫ్ నాయిస్ అండ్ పొల్యూషన్' అని కాదనేది మనందరం గుర్తు పెట్టుకోవాలి. మన ఆనందం కోసం అందమైన ప్రకృతిని నాశనం చేయకూడదు. టపాసులకి అయ్యే ఖర్చును పేదవారికి సహాయం చేయడానికి ఉపయోగిస్తే వెలుగుల పండుగకు అసలైన అర్థం చేకూరుతుంది. ప్రతి ఒక్కరూ దీన్ని బాధ్యతగా భావించాలి. ఈ విషయాలను కూడా పరిగణనలోకి తీసుకొని ఉంటే బాగుండేది.

**- సీత. ఆర్,** తార్నాక

•••

**దీ**పావళి వెలుగులను మరింత పెంచుతూ వచ్చిన ఈ వారం కవర్‌స్టోరీ చాలా బాగుంది. విదేశాల్లో కూడా దేదీప్యమానంగా దీపావళి పండుగ జరుపుకుంటారని తెలుసుకొని ఆశ్చర్యపోయాం. సింగపూర్‌లో 'లిటిల్ ఇండియా' స్ట్రీట్‌లో దీపావళి పండుగ సందర్భంగా చేసే కార్యక్రమాలు మంత్రముగ్ధులను చేశాయి. 'దీపావళి ఫెస్టివల్ విలేజ్' గురించి తెలుసుకున్నాక వెంటనే అక్కడికి వెళ్లిపోయి దీపావళి సంబరాలు చూడాలనిపించింది. ఇన్ని దేశాలలో జరుపుకునే దీపావళి నిజంగా ప్రపంచ పండగే.

**- డా. కె.ఎల్.వి. ప్రసాద్, శ్రీమతి అరుణ కానేటి,** హన్మకొండ

### స్ఫూర్తిదాయకం

**కొ**త్త జిల్లాలు ఏర్పడిన తర్వాత నియమితులైన కొత్త కలెక్టర్ల వివరాలను తెలుపుతూ ఇచ్చిన 'కొత్త కలెక్టర్ గారు..' కథనం ఆసక్తికరంగా చదివించింది. సాధారణంగా ఇలాంటి కథనాలను జిల్లా ఎడిషన్స్‌లో ఇస్తుంటారు. కాని ఆదివారం అనుబంధంలో ఇవ్వడం వల్ల ఎక్కువమందికి చేరుతుంది. కష్టపడి కలెక్టర్ హోదాకు చేరుకున్న వారి విషయాలను చదివి భవిష్యత్ తరాలవారు స్ఫూర్తి పొందుతారు.

**- పద్మావతి,** చేవెళ్ల

### నవ్విస్తూ ఆలోచింపజేసింది

**ఈ** వారం కథ 'సారథి స్టూడియోలో ఒక రోజు..' చాలా బాగుంది. హాస్య ప్రధానంగా నడిచినప్పటికీ సినిమాల్లో రాణించాలనే రంగుల కలలతో కన్నవారిని, ఉన్న ఊరిని వదిలిపెట్టి, పొట్ట చేతపట్టుకొని ఇండస్ట్రీకి వచ్చేవారి రోజువారీ జీవనం ఎలా ఉంటుందో కళ్లకు కట్టినట్టుగా చూపించారు రచయిత. తెలుగు సినిమాల్లో నటించే హీరోయిన్లు, విలన్లు తెలుగువారు కాకపోవడం, వాళ్ల గొంతెమ్మ కోరికలు తీర్చలేక మన దర్శకులు పడే తిప్పలు, అసిస్టెంట్ డైరెక్టర్ల కష్టాలను కూడా చాలా చక్కగా వివరించారు.

**- సుమతి చిట్యాల,** ఈమెయిల్

### ఆదర్శనీయం

**క**రువు సీమగా పిలవబడే రాయలసీమలో పేదలకు నిత్యాన్నదానం చేస్తున్న ఆశ్రమాల గురించి తెలుపుతూ ఇచ్చిన 'అన్నం పెట్టే కాశినాయన' వ్యాసం చాలా బాగుంది. కులమతాలను చూడకుండా ఆకలి అని వచ్చినవాడికి కడుపునిండా అన్నంపెట్టే ప్రతి మనిషీ దేవుడిగా మారతాడని కాశినాయన జీవితం చూస్తే అర్థమవుతుంది.

**- సురేష్,** చిలకానగర్

### ఈ 'బేతాళుడు' నచ్చాడు

**కే**రింత పేజీలో ప్రవేశపెట్టిన 'బేతాళ ప్రశ్న' శీర్షిక అద్భుతంగా ఉంది. బేతాళుడు వేసే ప్రశ్నలు మెదడుకు పదును పెట్టేలా ఉంటున్నాయి. వచ్చేవారం పుస్తకం కోసం ఎదురుచూసేలా కుతూహలాన్ని కలిగిస్తున్నాయి. పాఠకులలో సృజనాత్మకతను పెంచేందుకు ఇది చాలా ఉపయోగపడుతుంది.

**- మడ్డు తిరుపతిరావు,** శ్రీకాకుళం

### చెదరని చరిత్ర

**అ**మూల్యమైన రాతపత్రుల గురించి తెలుపుతూ ఇచ్చిన 'రాత పత్రులు' ఆకట్టుకుంది. చరిత్ర గురించి వివరంగా తెలుసుకోవాలనుకునేవారికి, సంబంధిత విభాగంలో పరిశోధన చేస్తున్న వారికి ఈ శీర్షిక ఎంతో ఉపయోగపడుతుంది.

**- శేఖర్,** అల్వాల్

'ఆదివారం అనుబంధం'పై మీ అభిప్రాయాలను శుక్రవారంలోగా అందేలా పంపగలరు. ఆలస్యంగా అందిన ఉత్తరాలు ప్రచురించడం సాధ్యపడదని మనవి. sunday.aj@gmail.com కి మీ ఉత్తరాల్ని మెయిల్ చేయవచ్చు.





**'గాజువాక పిల్ల' లాంటి జనపదంతో జనం చిందులేసేలా చేసినా... 'నువ్వంటే నాకిష్టం' అంటూ కుర్రకారు గుండెల్లో వలపు చిచ్చు పెట్టినా... 'ఒక్కడై రావడం, ఒక్కడై పోవడం' లాంటి జీవిత సత్యాన్ని కాచి వడబోసిన సాహిత్యానికి స్వరం కూర్చి 'ఆ నలుగురు' మెప్పు పొందినా... ఒక్క ఆర్పీ పట్నాయక్ కే సాధ్యం. గాయకుడిగా, సంగీత దర్శకుడిగా... టాలీవుడ్‌పై తనదైన ముద్రను వేసిన ఆర్పీ పట్నాయక్ సప్తస్వరాల్లోంచి పుట్టిన మరో పాట 'మధురం... మధురం'. ఆ పాట సంగతులే ఈ వారం 'నా పాట'లో....**

# మధురం... మధురం

నేను తొలిసారి సంగీతం అందించిన సినిమా 'నీకోసం'. సంగీత దర్శకుడిగా, గాయకుడిగా ప్రారంభమైన నా సినీ ప్రయాణం 'అందమైన మనసు' సినిమాతో దర్శకుడిగా మలుపు తిరిగింది. తాజాగా 'మనలో ఒకడు' సినిమాకు దర్శకత్వం వహించాను. ఈ సినిమా ఆడియో రిలీజైన కొద్ది రోజుల్లోనే 'మిలియన్ క్లిక్స్' సాధించి భారీ విజయం సాధించింది. ముఖ్యంగా 'మధురం... మధురం' పాట విని బాలసుబ్రహ్మణ్యంగారు 'ఈ పాట పాడిన సునీతకు నేషనల్ అవార్డు రావాలి. అంత బాగా పాడింది' అని మెచ్చుకున్నారు. ఆ పాట అంత బాగా రావడానికి కారణమైన తెర వెనుక విశేషాలను పంచుకుందామని ఇలా మీ ముందుకొచ్చాను.

'మధురం మధురం..' పాటను హీరోయిన్ 'అనిత'పై పిక్చరైజ్ చేశాం. ఈ సినిమాలో ఆమె సంగీతం టీచరుగా కనిపిస్తారు. కాబట్టి సంగీత ప్రాధాన్యం కలిగిన పాటైతే బాగుంటుంది అనుకున్నాం. అదే సమయంలో ఆమె ఓ సాధారణ మధ్యతరగతి గృహిణి. అందుకే ఆమె వృత్తికి, ప్రవృత్తికి ముడిపెడుతూ పాట రావాలని ముందే అనుకున్నాం.



నా పాట...29

గీత రచయిత చైతన్యప్రసాద్... కథానాయికలోని ఈ రెండు కోణాలనూ ఆ పాటలో ఆవిష్కరించారు. ఈ సినిమాకి డైరెక్టర్‌ని, మ్యూజిక్ డైరెక్టర్‌నీ నేనే కాబట్టి... నాకెలా కావాలో అలా పాటను స్వరపరిచాను. బాలుగారి మెచ్చుకోలుతో నా తపస్సు ఫలించిందనిపించింది.

'మధురం' పాటకు ట్యూన్ కట్టాకే చైతన్యప్రసాద్‌గారిని పిలిచి సందర్భం వివరించాను. 'ఆ నలుగురు' సినిమా చేసినప్పటి నుంచి మా ఇద్దరి మధ్య చక్కటి అవగాహన ఉంది. నాకేం కావాలో ఆయనకు తెలుసు. ఆయనేం ఇస్తారో... ఎలా ఇస్తారో.. నాకు తెలుసు. అంతేకాదు... ట్యూన్ ఇచ్చేటపుడే నేను ఆయనకు కొన్ని పరిమితులు చెపుతాను. ఆ పరిమితుల్లోనే అందమైన భావాలకు ప్రాణం పోస్తారాయన. అందుకే మా కలయికలో వచ్చిన ఏ పాట విషయంలోనూ మా మధ్య ఎలాంటి సమస్యా రాలేదు. అలాగని మేం ఘర్షించుకోమని కాదు. బెటర్ అవుట్‌పుట్ కోసమే తాపత్రయపడతాం.

'కొన్ని పాటలు వినగానే అర్థం అవుతాయి. కొన్ని పాటల్లోని పదాలకు నిఘంటువు తిరగేయాలి. మనసుతో విని భావాన్ని పట్టుకోవాలి' అన్నారొకసారి త్రివిక్రమ్‌గారు. 'మధురం' పాట ఆ రెండో కోవకు చెందుతుంది. పాటలో కుటుంబాన్నీ, సంగీతాన్ని మిక్స్ చేయాలనుకున్నాం కాబట్టి దానికనుగుణంగానే చైతన్యప్రసాద్

**స్వరము శ్రీకరము అమృత సీకరము... స్వర మధురం**
**సరస సల్లాప వరమనోల్లాస లయ మధురం**
**నాట్యగానాల తకిట తిల్లాన జతి మధురం**
**చిలిపి కలహాల వలపు విరహాల గతి మధురం**

అనే లైన్స్ చెప్పారు. ఇందులో మొదటి పాదం, మూడో పాదం సంగీతాన్ని ప్రతిబింబిస్తే... రెండు, నాలుగు పాదాలు సంసారంలో సరిగమల్ని ఆవిష్కరించాయి. ఈ పాటను ట్యూన్ కట్టినప్పటి నుంచి రికార్డింగ్ పూర్తయ్యే వరకూ చైతన్యప్రసాద్, నేను... ఈ పాట గురించే మాట్లాడుకునేవాళ్లం. సునీతగారికి పాట నేపథ్యాన్ని, ఈ పాటను సినిమాలో చేర్చడం వెనుక ఉద్దేశాన్ని స్పష్టంగా చెప్పి... నాకు కావలసినట్టు పాడించుకున్నాను. 'అమృతవర్షిణి' రాగంలో స్వరపరచిన ఈ పాటలో రెండో చరణంలో వచ్చే పదాలు నాకు ఎంతగానో నచ్చాయి. సరిగ్గా ఏ భావాలు పలికితే బావుంటాయని భావించానో అలానే పాట ఇచ్చారు చైతన్యప్రసాద్. 'అణువంత వింత తనువంత పులకింత... అల పాలపుంతలింకెంత వింత' అని అడుగుతూ... 'పెనువింతలన్నీ చినబోయేంత' అని రాశారు చైతన్యప్రసాద్.



చైతన్యప్రసాద్

**సప్తపదీ సప్తస్వరాలొకటిగా**
**జంట పదం.. జంట స్వరాలాయెగా**
**జీవితమే సాగెనొకే తాళముగా... శ్రావ్యముగా..**
**సంసార సార సుధాయోగమతి మధురం..**

అని రాశారు. ఈ పాట విని చాలామంది నాకు ఫోన్లు చేశారు. అందరూ చెప్పిందొకటే... 'ఇంత భావయుక్తమైన పాట ఈ మధ్య కాలంలో రాలేదండీ!' అని. భవిష్యత్తులో సంగీత పోటీలలో ఈ పాటను ప్రధానాస్త్రంగా చేసుకుని దీనికి మరింత ఆయువు పోస్తారని నా ప్రగాఢ విశ్వాసం. ఈ ఒక్క పాట అనే కాదు.. మిగిలిన పాటలూ శ్రావ్యంగా ఉండేలా కంపోజ్ చేశాను. 'బ్రోకర్'లాంటి సామాజిక స్పృహ కలిగిన సినిమాని డైరెక్ట్ చేసిన తర్వాత మళ్లీ అంతే బలమైన కథనంతో సినిమా తీయాలనే ప్రయత్నంలో నా మనసుకు చేరువైన కథ 'మనలో ఒకడు'. ఇలాంటి సినిమాలో పాటలకేం ప్రాధాన్యత ఉంటుందిలే అనుకుంటారు చాలామంది. కానీ కథలో పాటలకూ ప్రాధాన్యం ఉంది. ■










### ('మంచి మనసులు' చిత్రంలోని 'అహో ఆంధ్ర భోజా ..' పాటకు)

అహో బాలోత్సవమా!
కొత్తగూడెం బాలోత్సవమా!
బాలబాలికల భాగ్యోదయమా!
మా గుండెల్లో చిరంజీవి వైనావయా ...

పిల్లల హృదయాలలో నిలచినావు
మన ఊరికే అందాలు తెచ్చినావు
పిల్లల హృదయాలలో నిలచినావు ..



బాల్యమే కరువైన పెద్దవారికి సైతం
మురిపించి కనువిందు కలిగించు రీతిగా
ఉత్సవాలను నీవు జరిపించినావు

ఒకవైపు ఉగ్రాతలూపు కవనాలు
ఒకపక్క రంజిల్లు జానపదాలు
ఒక చెంత సంస్కృతి చాటు నాట్యాలు
నవరసాలొలికించు బాలోత్సవాంశాలు

బడిలో బంది అని బాధ పడవలదు
బాలోత్సవములోన నీ ప్రతిభ చూపు
చిన్నారుల ప్రతిభతో మన ప్రాంగణము
మన ఊరికే అందాలు తెచ్చెనోయీ
మన కీర్తినంబరమునుంచెనోయీ ...

**- మండవ సుబ్బారావు,** subbarao.mandava@gmail.com

నవ్వుల్

## ఔరా!

- ఇంటర్వ్యూకి వెళ్లిన అభ్యర్థి మూర్ఛబోయే సందర్భం?
  - కౌరవ సోదరుల పేర్లు చెప్పమని అధికారి అడిగినప్పుడు.
- సిసలైన కమ్యూనిస్టు?
  - భార్య కొత్తచీర ఎలా ఉందో చెప్పమంటే 'చీర వెనక నేతగాళ్ల శ్రమ కనిపిస్తోంద'ని చెప్పేవాడు.

**- అబ్బగాని భాస్కర్,** మహబూబాబాద్

## ఫేస్ ప్రాబ్లమ్!



**"బంటీ** ... చైనా క్రికెట్ ఎందుకు ఆడదు?"
"కొన్ని టెక్నికల్ ప్రాబ్లమ్స్ .."
"ఏంటవి?"
"అందరి ముఖాలూ ఒకేలా ఉంటాయి. ఎవరైనా అవుటై పెవిలియన్‌కి వెళితే మళ్లీ బ్యాటింగ్ చేయడానికి ఎవడొస్తాడో గుర్తు పట్టలేము. ఒక్కోసారి అవుట్ అయినవాడు కూడా మళ్లీ బ్యాటింగ్ చేయడానికి రావచ్చు. అందుకని ఐసిసి చైనాని బ్యాన్ చేసింది."

## క్యా డైలాగ్ హై



- అందంగా ఉండడం అంటే మనకు నచ్చేలా ఉండడం. ఎదుటివాళ్లకు నచ్చేలా కాదు.

చిత్రం : **జల్సా**



- 'అడిగినదానికి సమాధానం చెబితే తెలివితేటలంటారు. చెప్పకపోతే పొగరు అంటారు'

చిత్రం : **అతడు**



- 'నేనెవరికైనా నచ్చకపోతే అది వాళ్ల ప్రాబ్లమ్. నాది కాదు.'

చిత్రం : **చిరునవ్వుతో..**

**ఎక్కడైనా పెళ్లంటే ఏం చేస్తారు? అందరికీ శుభలేఖలు పంచుతారు. ఇంటిముందు పందిరి వేస్తారు. బంధుమిత్రులను ప్రత్యేకంగా ఆహ్వానిస్తారు. పంచభక్ష్య పరమాన్నాలతో విందు భోజనాలు వడ్డిస్తారు. వీటితో పాటు శ్రీకాకుళం, విజయనగరం జిల్లాల వాళ్లు మరో పని కూడా చేస్తారు. పెళ్లి కుదరగానే ఇంటికి రంగులు వేసి బయటి ప్రహరీ గోడ మీద పెళ్లి పత్రికను అందంగా రాయిస్తారు. దాంతో ఎవరూ చెప్పకుండానే ఊరందరికీ పెళ్లి కబురు తెలిసిపోతుంది.**




# గోడ శుభలేఖలు

శ్రీకాకుళం జిల్లాలోని 38 మండలాల్లోనూ ఈ అలవాటు ఉంది. వినడానికి విచిత్రంగా అనిపించే ఈ పద్ధతి అక్కడ యాభై ఏళ్ల నుంచీ ఉంది. వధూవరుల పేర్లతో పాటు తేదీ, ముహూర్తం అన్నీ పెద్ద అక్షరాలతో రాసి పెడతారు. ఆ పెయింట్ చెరిగిపోవడానికి ఎన్నేళ్లు పడుతుందో అన్నేళ్ల వరకూ అవి అలా కనిపిస్తూ ఉండాల్సిందే! శ్రీకాకుళం, రాజాం, పొందూరు, టెక్కలి, పలాస, సోంపేట, ఇచ్చాపురం, బూర్జ, పాతపట్నం, సరుబుజ్జిలి, రణస్థలం, లావేరు, ఎచ్చెర్ల, బామిని, హిరమండలం, కొత్తూరు, ఎల్ఎన్‌పేట, ఆముదాలవలస, నరసన్నపేట ... ఏ ఊర్లో చూసినా ఇంటి గోడలపై ఈ పెళ్లి పత్రికలు దర్శనమిస్తాయి. మామూలుగా అయితే పెళ్లి రోజున పెళ్లి వారి ఇంటి దగ్గరో, పెళ్లి జరిగే హాలు ముందో వధూవరుల ఫోటోలతో ఫ్లెక్సీలు పెట్టడమే మనకు తెలుసు. లేదంటే పెళ్లికొడుకు, పెళ్లికూతురు పేర్లతో లైటింగ్ అమర్చుతారు. పెళ్లి అయిపోయాక వాటిని తీసేస్తారు. కాని ఇంటిపేరుతో సహా పూర్ణకుంభం చిత్రం వేసి వధూవరుల పేర్లు, వివాహ తేదీ, ముహూర్తం గడియలతో సహా అందంగా రాయించి, ఆ అక్షరాలు ఎన్ని ఏళ్లయినా చెరపకుండా ఉంచడమనేది ఇక్కడ మాత్రమే కనిపించే విషయం.







## కొత్తవారికి వింత కుడ్యాలు

పెళ్లిపత్రికను గోడమీద రాయించడంలో ఒక్కొక్కరు ఒక్కో స్టైల్ ఫాలో అవుతారు. ఒకరు వధూవరుల పేర్ల మధ్య పూర్ణకుంభం గీయిస్తే, మరొకరు ఇరువైపులా అరటిచెట్ల బొమ్మలు గీయిస్తారు. కొందరు మంగళ వాయిద్యాలను జత చేస్తే ఇంకొందరు మామిడి తోరణాలను పైన అలంకరిస్తారు. స్వస్తిక్‌లు, హృదయం గుర్తులు, మన్మథ బాణాలు కూడా అక్కడక్కడ మెరుస్తూ కనబడతాయి. ఈ ఆనవాయితీ విజయనగరం జిల్లాలోని సగం మండలాల్లోనూ కనిపిస్తుంది. ఎందుకంటే 1979 జూన్ 1న శ్రీకాకుళం జిల్లాను విభజించినప్పుడు కొన్ని మండలాలు విజయనగరంలోకి వెళ్లాయి కాబట్టి. దానివలన ఉమ్మడి శ్రీకాకుళంగా ఉన్నప్పటి అలవాటే అక్కడ కొనసాగుతోంది. ఇతర ప్రాంతాల నుంచి ఇక్కడికి వచ్చే ఉద్యోగులు, వ్యాపారులు ఇంటి గోడలపై ఉన్న ఈ పెళ్లి కార్డులను చూసి ఆశ్చర్యంగా ఆరా తీస్తుంటారు. శుభలేఖలు అచ్చు వేయడం పెద్దగా ప్రాచుర్యంలోకి రాని కాలంలో ఈ పద్ధతి మొదలై ఉండవచ్చని భావిస్తున్నారు. రెండు వారాల ముందే రాస్తారు కాబట్టి వంటలు వండేవారికి, బట్టల, నగల వర్తకులకు తమ వ్యాపారాలు జరుపుకోవడానికి ఈ గోడ శుభలేఖలు ఒక అవకాశం ఇచ్చినట్టవుతుంది.

## ఒడిశా నుండి పాకిన ఆచారం

ఈ పద్ధతికి మూలం ఒడిశా అని చెబుతారు కొందరు. శ్రీకాకుళం, విజయనగరం జిల్లాలు ఆ రాష్ట్రానికి సరిహద్దు జిల్లాలు కాబట్టి అక్కడి సంప్రదాయమే ఇక్కడా కొనసాగుతోందని చెపుతారు. ఎలా వచ్చినప్పటికీ శుభలేఖలు, ఫోన్ మెసేజ్‌లు వచ్చాక కూడా ఈ పద్ధతి మారకపోవడం విశేషమే. ఒకప్పుడు సుద్దముక్క, లేదా బొగ్గుతో రాసే ఈ గోడ పెళ్లి పత్రికలు ఇప్పుడు రకరకాల డిజైన్లలో దర్శనమిస్తున్నాయి. ఎవరైనా అద్దెకు దిగేటప్పుడు ఈ పేర్లపై అభ్యంతరం చెబితే అలాంటి వారికి ఇల్లు అద్దెకు ఇవ్వడం నిరాకరిస్తారు. ఎండకు, వానకు అక్షరాలు కనబడకుండా పోతే కొందరు మళ్లీ కొత్తగా రాస్తారు కూడా.

ఎవరైనా ఇతర జిల్లాల్లో, రాష్ట్రాల్లో పెళ్లి చేసుకున్నా స్వస్థలంలోని వారి ఇంటి గోడపై పెళ్లిపత్రికను మాత్రం తప్పనిసరిగా రాయించి పెడతారు. శ్రీకాకుళం జిల్లా వలసలకు పెట్టింది పేరు కాబట్టి ఇక్కడినుంచి ఎందరో రెండు తెలుగు రాష్ట్రాలలోని వివిధ ప్రాంతాలకే కాక ముంబై, కర్ణాటక, బెంగళూరు, చెన్నై, ఢిల్లీ, ఒడిశా, కోల్‌కతా, గుజరాత్ వంటి పలు చోట్లకు ఉపాధి కోసం వెళ్లి అక్కడే స్థిరపడిపోయారు. పిల్లలను చదివించుకుంటూ వివాహాలు కూడా అక్కడే చేస్తున్నారు. దీంతో ఆయా ప్రాంతాల్లో కూడా సిక్కోలు వాసుల ఇళ్ల గోడలపై ఈ పెళ్లి శుభలేఖలు వెలుస్తున్నాయి.

**- చుక్కా అప్పారావు,** ఆంధ్రజ్యోతి, శ్రీకాకుళం

# లోక కళ్యాణం గ్యారంటీ!



రెండు వారాల క్రితం ఒక రోజు.

దీపావళి కదా అని నరకాసురుడు తలంటు పోసుకోవటానికి బాత్‌రూముకెళ్లాడు. అక్కడ ఆల్రెడీ స్నానం చేస్తున్న బల్లి .. పరపురుషుడిని చూసి కంగారు పడి, పారిపోయే ప్రయత్నంలో నరకాసురుడి తల మీద పడింది. అయినా అదేం పట్టించుకోకుండా స్నానం చేసి మసాలా ఓట్స్ తిని, యుద్ధానికి సిద్ధమయ్యాడు నరకుడు.

"కృష్ణుడూ సత్యభామా ఆల్రెడీ రణభూమికి వచ్చేసారటండీ .." అన్నాడు పరిచారకుడు.

వెంటనే కత్తి, విల్లమ్ములు తీసుకుని బయలుదేరాడు నరకాసురుడు. దోమల్‌గూడ ఏరియా దగ్గర జనం బాణాసంచా కాలుస్తూ ఉన్నారు.

"భయ్యా .. రథం కొంచెం సైడుకి తీసుకో .." అంటూ పక్కనే లక్ష్మీబాంబు పేల్చాడు ఒకడు.

మందహాసం

రథచక్రం డ్యామేజ్ అయ్యింది. దానివల్ల రణభూమి చేరుకునేసరికి బాగా ఆలస్యమైంది. పార్కింగ్ ఫుల్. రెండు కిలోమీటర్ల అవతల పార్క్ చేసి సరంజామా అంతా మోసుకుంటూ పరిగెట్టాడు. ఆయాసపడుతూ వస్తున్న నరకుడిని ఎంట్రెన్స్ దగ్గరే ఒకావిడ ఆపి "బ్యాగ్ ఓపెన్ సార్ .." అంది. లోపలున్న ఆయుధాలు ఒక్కొక్కటీ చూసింది. సైడ్ జిప్ తెరిచింది. బిస్కెట్ ప్యాకెట్ తగిలింది.

"Outside food not allowed sir" అని దాన్ని తీసి తన డెస్కులో పెట్టుకుంది.

'తిక్కపిల్ల' అని తిట్టుకుంటూ లోపలికెళ్లాడు.

సైనికులు, శత్రువులు అంతా సిద్ధంగా ఉన్నారు. "సారీ .. సారీ .." అని గబగబా విల్లు తీసుకున్నాడు. ఆ పక్కన కుర్చీల్లో కూర్చుని మందు కొడుతున్న కొంతమంది తెల్లవాళ్లు కనిపించారు. ఒక సైనికుడిని పిలిచి .. "సుబ్బారావు .. ఎవరు వాళ్లు?" అని అడిగాడు.

"అమెరికా నుండి వచ్చారు సార్ .. ఏం కావాలని అడిగితే 'We are here to watch the fireworks ..' అన్నారు. వాళ్ల 'July 4th' తిథుల ప్రకారం మన దీపావళి రోజట .." సమాధానమిచ్చాడు సుబ్బారావు.

"సరేలే .. నా చేతులు మరీ పొడిగా ఉన్నాయి. కాస్త vaseline ఇచ్చి, శంఖం పూరించమను మన వాళ్లని. నేను రెడీ .." అని దేవుడికి దండం పెట్టుకున్నాడు నరకాసురుడు.

శంఖం పూరించారు. స్కోర్ వేసుకునేవాడు పెన్ను, నోటుబుక్ బయటికి తీశాడు. నరకుడు విల్లు ఎక్కుపెట్టాడు.

ఇంతలో ఎవడో వదిలిన రాకెట్ బాంబు ఆకాశంలో పేలింది.

"సార్ .. పైకి చూడండి ... రాకెట్ .. డిజైన్లు డిజైన్లుగా పేలుతోంది .." అన్నాడు సుబ్బారావు ఆశ్చర్యంగా. ఆ విడ్డూరమేంటో చూద్దామని తల పైకెత్తాడు నరకాసురుడు.

ఇంతలో ఫీల్డింగ్ సైడు నుంచి వచ్చిన బాణం నరకుడి గుండెలో కసుక్కున దిగింది.

దీపావళి టపాసులు మిన్నుముట్టాయి.

మండపానికి, డెకరేషన్‌కి బాగా ఖర్చు అయినా లోకకళ్యాణం బాగా జరిగిందన్న ఆనందంతో అందరూ ఇంటిముఖం పట్టారు.

- ఈ కథ విన్నవారికి సకల సౌభాగ్యాలూ కలుగును. గ్యారంటీ.

## హాయిగొలిపే అబద్ధం



చిన్నప్పుడు ఇంటి బయట ఉన్న పిచ్చి మొక్కను తల్చుకుని "ఆ వేప చెట్టు కింద మంచమేసుకుని పడుకుంటే ఎంత హాయిగా ఉండేదో .." అని మనల్ని మనం మోసం చేసుకోవటమే Nostalgia.

నిజం కాకపోయినా మనసుకి హాయిగా ఉంటుంది.

## పచ్చడైపోతాన్రోయ్!



ఎదురు దెబ్బలు తిన్న ప్రతివాడూ రాటుదేలాలని రూలేమీ లేదు. పువ్వుని సుత్తితో ఎన్నిసార్లు కొట్టినా అది ఇనుపముక్క అయిపోదు. దెబ్బ తగిలిన ప్రతిసారి నలిగి మరింత నాశనమవుతుందంతే.

– డి. సిద్ధార్థ గౌతమ్, facebook.com/dsgoutham







# ఆన్‌లైన్ రమ్మీ ఆడుతున్నారు జోరుగా...



**చతుర్ముఖపారాయణం, మూడు ముక్కలాట, పేకాట, ప్లేయింగ్ కార్డ్స్, రమ్మీ ... పేరేదైనా అదొక జూదం అంటారెవరైనా. సరదాగా ఆడితే పర్వాలేదు కానీ అది అక్కడితో ఆగదనేది అందరి భయం. పేకాట ఉచ్చులోపడి ఆర్థికంగా చితికిపోయినవారి గురించి, రోడ్డున పడ్డ కుటుంబాల గురించి ప్రతీ ఊళ్లో ఇప్పటికీ కథలు కథలుగా చెప్పుకుంటుంటారు. అందుకే డబ్బు పెట్టి ఆడే పేకాటను ప్రభుత్వాలు నిషేధించాయి. పేకాట ఆడుతూ పట్టుబడితే భారీ జరిమానాలు వేస్తూ, జైలుశిక్షలు వేస్తున్న వార్తలు కూడా అప్పుడప్పుడు వింటూనే ఉన్నాం.**

**అయితే అన్ని రంగాల్లోకి టెక్నాలజీ ప్రవేశించినట్టే, పేకాటలోకి కూడా ప్రవేశించింది. ఇప్పుడు ఆన్‌లైన్ జూదం అఫీషియల్‌గా మారింది. దానిని ఇప్పుడు స్టయిల్‌గా 'స్కిల్డ్‌గేమ్' అంటున్నారు. ఇంటర్నెట్ ఓపెన్‌చేస్తే చాలు... లెక్కలేనన్ని 'ఆన్‌లైన్ రమ్మీగేమ్'లు పేకముక్కలతో ఆహ్వానిస్తున్నాయి. బోనస్‌లు, బంపర్ ఆఫర్లు... ప్రారంభ ఆఫర్లు, పండగ స్పెషల్స్ అంటూ జూదప్రియులకు గాలం వేస్తున్నాయి. స్పెషల్ అట్రాక్షన్‌గా సినిమా తారలతో ప్రకటనలు కూడా గుప్పిస్తున్నాయి. ఇప్పుడు చతుర్ముఖపారాయణానికి ఓ చోటు చూసుకుని, నలుగుర్ని వెదుక్కోవాల్సిన పనిలేదు. ఎక్కడైనా, ఎప్పుడైనా... సైట్‌గానీ, యాప్‌గానీ ఓపెన్ చేసి రిజిస్టర్ అయితే చాలు... క్షణాల్లో టేబుల్ 'ఫుల్' అయిపోతుంది. మరుక్షణం 'గేమ్' షురూ... 'కౌంట్'లు, 'డ్రాప్'లు, 'షో'లు... మీ ఇష్టం. స్మార్ట్‌ఫోన్‌లలో వేలం వెర్రిగా మారిన ఈ నయాట్రెండ్ గురించే ఈ వారం కవర్‌స్టోరీ.**

'నాందేవ్ ఆన్‌లైన్ రమ్మీ ఆడి నిజమైన నగదు గెలిచాడు ఎలాగో తెలుసుకోవాలనుకుంటున్నారా?' అనే వాక్యం కింద అతడి ఫోటో ఉంటుంది. దాని కింద 'నేను 10 వేల రూపాయలు గెలిచాను... తండ్లె నాందేవ్‌రావు, ఆంధ్రప్రదేశ్' అని కనిపిస్తుంది.

ఫేస్‌బుక్‌లో ఇలాంటి ప్రకటనలు తరచూ కనిపించడం మీరు చూసే ఉంటారు.

●●●

'రమ్మీసర్కిల్.కామ్' వెబ్‌సైట్‌కు వెళితే "ఈ సైట్‌లో రమ్మీ ఆడటం చాలా వినోదాత్మకంగా ఉంటుంది. రమ్మీ ఆడి నేను వారంలో పదివేలు గెలుచుకున్నాను" అని చెన్నైకి చెందిన లాజిస్టిక్ ప్రొఫెషనల్ టి.సుందర్ కామెంట్ కనిపిస్తుంది. అలాగే సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా పనిచేస్తున్న లింగరాజు 2.5 లక్షల రూపాయలతోపాటు హాంకాంగ్, మకావ్ ట్రిప్‌లను గెల్చుకున్నట్లు ప్రకటనలు కనిపిస్తాయి.

●●●

ప్రస్తుతం ఆన్‌లైన్‌లో ఈ తరహా 'రమ్మీ' మూడుముక్కలు, ఆరు ఆటలుగా సాగుతోంది. ఆన్‌లైన్ రమ్మీ పోర్టల్స్ ప్రతీ యేడాది ఇబ్బడిముబ్బడిగా పెరుగుతున్నాయి. దీనికి ప్రధాన కారణం స్మార్ట్‌ఫోన్లు, ఇంటర్నెట్ ఉపయోగిస్తున్నవారి సంఖ్య పెరగడమే. ఇండియాలో ఇంటర్నెట్ వినియోగిస్తున్నవారి సంఖ్య 34.8 శాతానికన్నా ఎక్కువగా ఉందని, ప్రస్తుతం మూడోస్థానంలో ఉన్న (చైనా, అమెరికాల తర్వాత) ఇండియా ఈ యేడాది చివరికి అమెరికాను వెనక్కి నెట్టి రెండోస్థానంలోకి వస్తుందని 'ఇంటర్నెట్ అండ్ మొబైల్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా' (ఐఎఎంఎఐ) అంచనా వేసింది. ఈ సంస్థ ఇచ్చిన రిపోర్టు ప్రకారం మన దేశంలో ఇంటర్నెట్ వాడుతున్నవారి సంఖ్య అర్బన్‌లో 65 శాతం పెరిగితే, రూరల్‌లో 99 శాతం పెరిగింది. సరిగ్గా ఈ







గణాంకాలే మొబైల్ గేమింగ్ ఇండస్ట్రీకి బలాన్ని చేకూర్చాయి. వినియోగదారుల ఇష్టాయిష్టాలను దృష్టిలో పెట్టుకుని 'గేమ్'లను రూపొందిస్తే కోట్ల రూపాయల వ్యాపారం జరుగుతుందని గేమింగ్ ఇండస్ట్రీ గుర్తించింది. పట్టణాలతో పాటు పల్లెల్లో కూడా పేకాట (కార్డ్‌గేమ్)కు ఉన్న క్రేజ్‌ను గమనించి 'టెక్నాలజీ'ని తమకు అనుకూలంగా మలుచుకుని అనేక 'రమ్మీ' సైట్లకు రూపకల్పన చేశారు. గత రెండేళ్లలో ఈ వెబ్‌సైట్లకు, యాప్స్‌కు పెరిగిన ఆదరణ అంతా ఇంతా కాదు. 2014-2018 మధ్యకాలంలో గేమింగ్ ఆదాయం 49.2 శాతం పెరుగుతుందని, ఇది ఈ రంగంలో ప్రపంచంలోనే వేగవంతమైన అభివృద్ధి అని పరిశీలకులు చెబుతున్నారు.

### పుట్టగొడుగుల్లా ఆన్‌లైన్ 'రమ్మీ' వెబ్‌సైట్లు ...

పేకాటరాయుళ్ల సరదా తీర్చడానికి ఆన్‌లైన్‌లో అనేక 'రమ్మీ' సెంటర్లున్నాయి. అవన్నీ కూడా వేలాది, లక్షలాది ప్లేయర్స్‌తో నిరంతరం బిజీగా ఉంటున్నాయి. రమ్మీసర్కిల్, క్లాసిక్‌రమ్మీ, రమ్మీమిలియనీర్, జంగ్లీరమ్మీ, తాజ్‌రమ్మీ, దక్కన్‌రమ్మీ, ఏస్2త్రీ, అడ్డా52... ఇలా అనేక వెబ్‌సైట్లు, యాప్‌లు ఆటగాళ్లకు అందుబాటులో ఉన్నాయి. ఈమెయిల్ ఐడి లేదా సెల్‌ఫోన్ నెంబర్‌తో ఒక యూజర్‌ఐడి, పాస్‌వర్డ్ క్రియేట్ చేసుకుని ఈ సైట్లలోకి ఎవరైనా లాగిన్ కావొచ్చు. వీటిలో కొన్ని సైట్స్‌లో ఇంగ్లీషు, హిందీ, తదితరాలతో పాటు తెలుగు ఆప్షన్ కూడా ఉంది. ఎవరికి నచ్చిన భాషను వాళ్లు ఎంచుకుని ఆడొచ్చు. యాప్‌ను మొబైల్‌లోకి కూడా ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకుని ఆట ప్రారంభించొచ్చు. అంతేకాదు ఆట తెలియని వారి కోసం నేర్చుకునేందుకు 'లెర్న్ టు ప్లే' ఆప్షన్ కూడా ఉంది. దాన్ని నొక్కితే ఆట ఎలా ఆడాలో, ఏమేం చేయాలో వీడియో ద్వారా ప్రతీ ఒక్కరికి అర్థమయ్యేలా మూడు నుంచి ఐదు నిమిషాల పాటు డెమో ఉంటుంది. భారతీయ మార్కెట్లోకి తొలిసారి రమ్మీని ప్రవేశపెట్టినట్టుగా చెప్పుకునే 'ఏస్2త్రీ' రమ్మీ పోర్టల్ తమకు 70 లక్షలకు పైగా యూజర్స్ ఉన్నట్లు పేర్కొంది. మరో పోర్టల్ 'రమ్మీసర్కిల్' తమకు 32 లక్షలకు పైగా ఆటగాళ్లు ఉన్నట్లు 'హోమ్‌పేజ్'లో పెట్టింది.

### స్వాగత ఆఫర్లు, క్యాష్ ఆఫర్లు ...

మార్కెట్లో కస్టమర్లను ఆకట్టుకునేందుకు ఉచిత బహుమతులు, క్యాష్‌బ్యాక్ ఆఫర్లు ప్రకటించినట్టుగానే వీరు కూడా అనేక గిమ్మిక్కులతో ఆటగాళ్లను ఆకట్టుకోవాలని చూస్తున్నారు. ఉదాహరణకు 'క్లాసిక్‌రమ్మీ'లో రిజిస్టర్ చేసుకుంటే తక్షణమే వెయ్యి రూపాయలు వాళ్లు మన కోసం ఏర్పాటు చేసే వెబ్‌సైట్ అకౌంట్లో ఉచితంగా వేస్తున్నారు. మిగతా పోర్టల్స్ కూడా దాదాపు ఇలాంటి ఆఫర్లనే ప్రకటిస్తున్నాయి. అదేవిధంగా డైలీ లక్కీడ్రాలో 150 విన్నర్స్‌కు ఒక్కొక్కరికి 5వేల రూపాయల క్యాష్‌బ్యాక్ ఆఫర్లను కూడా ఇస్తున్నాయి. గ్రేట్ రమ్మీ ఛాంప్స్ పదిమందికి ప్రతీవారం 10 వేల రూపాయల క్యాష్‌బ్యాక్, యాప్ బోనస్ కింద ప్రతీ డిపాజిట్‌కు 5 శాతం అదనపు బోనస్‌ను కూడా అందజేస్తున్నాయి. ఈ ఆఫర్లు సహజంగానే అందరినీ ఆకర్షిస్తున్నాయని, అందుకే వీలైనన్ని ఎక్కువ ఆఫర్లు కస్టమర్లకు అందుబాటులోకి తెస్తున్నామని వీటి నిర్వాహకులు అంటున్నారు. వీటితో పాటు మరో గమ్మత్తయిన ఆఫర్ కూడా ఉంది. అదేమిటంటే 'రిఫర్ అండ్ ఎర్న్'... అంటే ఒక మిత్రుడిని ఫలానా వెబ్‌సైట్‌లో రిజిస్టర్ చేయించిన తర్వాత 90 రోజుల్లో అతడు ఆటకు ఎంత వెచ్చిస్తాడో (గరిష్టంగా వెయ్యి రూపాయలు) అంత మొత్తం మీ అకౌంట్లోకి బోనస్ రూపంలో వచ్చే ఆఫర్.. వీటితో పాటు దసరా, దీపావళి, న్యూ ఇయర్ వంటి అనేక ప్రత్యేక సందర్భాల్లో బోనస్‌లు కూడా ప్రకటిస్తున్నారు.



### అనేక రకాల కార్డ్‌గేమ్స్...

కార్డ్‌గేమ్స్ తెలిసిన వారంతా తమ తాహతు, ఆసక్తికి తగ్గ గేమ్‌ను ఎంచుకునే అవకాశం ఉంది. ఎంతమందితో ఆడాలనుకుంటున్నారో అంతమందిని ఎంచుకునే ఆప్షన్ కూడా ఉంటుంది. ఇద్దరి నుంచి ఆరుగురు ఉండే టేబుల్‌ను ఎంచుకుంటారా? జోకర్ ఉండాలా...వద్దా? ఎంత బెట్ పెడుతున్నారు? (5 రూపాయల నుంచి లక్షల రూపాయల వరకు టేబుల్స్ ఉంటాయి)వంటి అంశాలను కూడా ఎవరికి వారుగా ఎంచుకోవచ్చు. అలాగే 'ఫ్రీ రమ్మీ', 'పాయింట్ రమ్మీ', 'పూల్ గేమ్స్', 'మల్టీటేబుల్ టోర్నమెంట్, 'తీన్‌పత్తి' వంటి అనేక ఆటలు కూడా ఉంటాయి. వీటిలో వీకెండ్ లూట్ టోర్నమెంట్, సండే మాస్టర్స్ టోర్నమెంట్, జంబో టోర్నమెంట్, ప్లాటినం క్లబ్ టోర్నీ, దివాలీ రమ్మీ వంటి ప్రత్యేక టోర్నమెంట్లు చాలా ఉన్నాయి. ఒకరకంగా మార్కెట్లో కస్టమర్లను ఆయా షాపులవాళ్లు ఆకర్షించాలనుకున్నట్టే ఆన్‌లైన్‌లోనూ ఆ తతంగమంతా కనిపిస్తుంది. ఆటగాళ్లు వెచ్చించే మొత్తాన్నిబట్టి వారిని ఆయా టేబుళ్లకు ఆకర్షించేలా ప్రకటనలుంటాయి. "మనం వెచ్చించే మొత్తంలో వారి కమీషన్ మినహాయించుకునే ప్రైజ్‌మనీని ప్రకటిస్తారు. ఉదాహరణకు 100 రూపాయల బెట్‌తో 6 గురు రమ్మీ ఆడితే ఒక్కొక్కరి దగ్గరి నుంచి 15 రూపాయలు తీసుకుని (90 రూపాయలు) మిగతా మొత్తాన్ని ఆటలో పెడతారు. అంటే గెలిస్తే వచ్చేది 510 రూపాయలే. ఇలా ఒక్కో ఆటకు ఒక్కో వెబ్‌సైట్ కమీషన్ ముందే వసూలు చేస్తుంది" అని మహేందర్ అనే ఉద్యోగి చెప్పారు. ఒక ప్రైవేట్ కంపెనీలో పనిచేస్తున్న మహేందర్ గత రెండేళ్లుగా ఆన్‌లైన్‌లో రమ్మీ ఆడుతున్నారు.

### అంతా ఆన్‌లైన్‌లోనే ...

ఆన్‌లైన్ రమ్మీలో నగదు లావాదేవీలకు ఏ మాత్రం అవకాశం లేదు. పేమెంట్ ఆప్షన్‌లోకి వెళ్లి డెబిట్‌కార్డు ద్వారాగానీ, క్రెడిట్ కార్డు ద్వారాగానీ మాత్రమే చెల్లింపులు జరపాలి. అన్ని ప్రధాన బ్యాంకు కార్డులనూ అనుమతిస్తారు. నెట్‌బ్యాంకింగ్ సౌకర్యం కూడా ఉంది. డబ్బు క్రెడిట్ అయిన తర్వాత ఆ మొత్తం స్క్రీన్‌పై కనిపిస్తుంది. గెలిచిన మొత్తాన్ని కూడా ఆయా వెబ్‌సైట్లు మన అకౌంట్‌లోనే వేస్తాయి. ప్రతీ 24 గంటలకు పేమెంట్లు ప్రాసెస్ చేస్తారు. కొన్ని చెల్లింపులు చెక్కుల ద్వారా కూడా చేస్తారు. పదివేలకు మించి లావాదేవీలు జరిగితే లెక్కప్రకారం టీడీఎస్ (టాక్స్ డిడక్టెడ్ ఎట్ సోర్స్) కూడా చెల్లించాల్సి ఉంటుంది. "ఈ ఆట కోసం మేము లైసెన్స్‌డ్ సాఫ్ట్‌వేర్‌ను వినియోగిస్తాం. దాంతో ఎవరూ కూడా మధ్యలో ఆపరేట్ చేసే అవకాశం ఉండదు. డబ్బు పెట్టి ఆడుతున్నారు కాబట్టి వారికి ఆటలోని అసలైన మజాను అందించవలసిందే" అని తాజ్ రమ్మీ మేనేజింగ్ డైరెక్టర్ పరీక్షిత్ మాడిశెట్టి అంటున్నారు. ఈ రమ్మీ ఆపరేటర్లకు పలు లాజిస్టిక్ సాఫ్ట్‌వేర్ కంపెనీలు సహకారాన్ని అందిస్తున్నాయి. కస్టమర్లు తమ సేవలకు సంతృప్తి చెందుతున్నారు కాబట్టే రోజురోజుకు ఆన్‌లైన్ రమ్మీకి స్పందన పెరుగుతోందనేది వారి అభిప్రాయం. రెగ్యులర్‌గా డబ్బులు పెట్టి ఆడుతున్న కొందరు కస్టమర్లకు ఈ సైట్లు 'వీఐపీ ప్లేయర్ సర్వీస్'ను కూడా అందిస్తున్నాయి. వారికి అదనంగా బోనస్‌లు ప్రకటించడం, వారి పుట్టినరోజు, పెళ్లిరోజులతో పాటు పండుగలకు సర్‌ప్రైజ్ గిఫ్ట్‌లను పంపడం చేస్తున్నాయి.










'జంగ్లీరమ్మీ' యాడ్‌లో రానా, ప్రకాష్‌రాజ్

## 'స్టార్' అట్రాక్షన్...

ఆన్‌లైన్ పేకాటను పాపులర్ చేసేందుకు క్రమక్రమంగా 'స్టార్లు' కూడా రంగంలోకి దిగుతున్నారు. ఇటీవలే ప్రకాష్‌రాజ్, రానా దగ్గుబాటిలతో 'ఆవో ఖేలే రమ్మీ' అంటూ 'జంగ్లీరమ్మీ' రూపొందించిన యాడ్ టీవీల్లో కనిపిస్తోంది. ఇప్పుడు పేకాట ఆడటంలో ఉన్న సౌలభ్యాన్ని హైలైట్ చేస్తూ వినోదాత్మకంగా మలిచిన ఈ యాడ్ చాలామందినే ఆకర్షిస్తోంది. " రమ్మీ అనేది మన సాంప్రదాయ, స్కిల్‌బేస్డ్ కార్డ్ గేమ్. అలాంటి గేమ్‌ను ఇప్పుడు ఎక్కడినుంచైనా, ఎప్పుడైనా ఆడొచ్చనే అభిప్రాయం ఈ యాడ్ ద్వారా కలుగుతుంది" అని 'జంగ్లీ గేమ్స్' వ్యవస్థాపకుడు, సీఈవో అంకుష్ గెరా అన్నారు. మరోవైపు టీవీల్లో, పత్రికల్లో ఇలాంటి యాడ్స్ రావడం పట్ల పెద్దఎత్తున విమర్శలు కూడా వెల్లువెత్తుతున్నాయి. డబ్బు కోసం స్టార్లు పేకాటను (ఆన్‌లైన్లో అయినా సరే) ప్రోత్సహించే అనైతిక చర్యలకు పాల్పడటం సమాజానికి అంత మంచిది కాదనే అభిప్రాయం ఆయా వర్గాల్లో వ్యక్తమవుతోంది.

## కొందరికి జూదం... కొందరికి రిలాక్సేషన్ ...

'ఆన్‌లైన్ రమ్మీ గాంబ్లింగ్ కాదు, అదొక నైపుణ్యంతో కూడిన ఆట (స్కిల్డ్‌గేమ్)' అని గత యేడాది సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది. ఈ తీర్పు ఆధారంగానే సరికొత్త ఆనందాన్ని, ఉల్లాసాన్ని కస్టమర్లకు అందిస్తున్నామని ఆన్‌లైన్ రమ్మీ సంస్థలంటున్నాయి. ముఖ్యంగా పట్టణాలకన్నా, పల్లెల్లో ఆన్‌లైన్ రమ్మీ వైపు ఆకర్షితులవుతున్నవారి సంఖ్య ఎక్కువగా ఉంది.




"నిన్నటి దాకా ఊళ్లో పేకాట ఆడాలంటే పోలీసులకు భయపడి దాక్కొని ఆడేవాళ్లం. కానీ నేడు స్మార్ట్‌ఫోన్‌లో పోలీసుల ఎదురుగానే ధైర్యంగా ఆన్‌లైన్‌లో రమ్మీ ఆడుతున్నాం. మంచి ముక్క పడితే డబ్బులొస్తున్నాయి. పడకపోతే డబ్బులు పోతున్నాయి. ఇది ఎక్కడైనా ఉండేదే కదా" అని పాలకొల్లుకు చెందిన సుబ్బరాజు అన్నారు. స్మార్ట్‌ఫోన్, ఇంటర్నెట్ సౌకర్యాలు మారుమూల గ్రామాలకు సైతం విస్తరించడంతో ఆన్‌లైన్ గేమింగ్‌కు అక్కడ కూడా ఆదరణ ఎక్కువవుతోంది. ఇంతకుముందు ఎవరికీ కనిపించని చోట కూర్చుని దొంగచాటుగా పేకాట ఆడేవారంతా ఇప్పుడు ఆన్‌లైన్ రమ్మీని రోజూ దర్జాగా కూర్చుని ఆడుకుంటున్నారు.

కొంతమంది ఆన్‌లైన్ రమ్మీని ఒత్తిడి తగ్గించే ఆటగా కూడా చూస్తున్నారు. ఒక సాఫ్ట్‌వేర్ కంపెనీలో పనిచేసే 22 ఏళ్ల రంజిత్ ఒత్తిడి నుంచి బయటపడేందుకు ఆన్‌లైన్ రమ్మీ ఆడుతుంటానని చెప్పారు. "ఇదొక వినోదాత్మక అనుభవం. ఆటలో స్కిల్స్‌ను ఉపయోగించడం వల్ల వినోదంతోపాటు డబ్బు కూడా లభిస్తోంది. వారానికి రెండు మూడుసార్లు ఆన్‌లైన్ రమ్మీ ఆడుతుంటాను" అని చెప్పారు రంజిత్. వారాంతాలు, పండగల సీజన్లో రమ్మీ వెబ్‌సైట్లు మరింత బిజీ అవుతున్నాయి. ఆ సమయంలో అవి మరిన్ని ఆకర్షణీయమైన ఆఫర్లను ప్రకటిస్తున్నాయి.

"మన దేశంలో పేకాట అనేది తరతరాలుగా ఒక సాంప్రదాయ వ్యసనంగా ఉంది. అందుకే ఇప్పటికీ దీన్ని జూదంగానే చూస్తున్నారు చాలామంది. అంతేకాదు, ఆన్‌లైన్ రమ్మీ పారదర్శకంగా ఉంటుందని ఎవరెన్ని చెప్పినా దానిలో మోసాలు జరగడం లేదని చెప్పడానికి వీలు లేదు. వర్చువల్ గేమ్‌లో టేబుల్ మీద కూర్చుంటున్నది ఎవరు? కార్డులు ఎలా వేస్తున్నారు? అనేది అనుమానాస్పదమే. డబ్బులు పోగొట్టుకున్నవాళ్లు పరువు పోతుందని కంప్లయింట్స్ చేయకపోయి ఉండొచ్చుగానీ, ఈ ఆటలో ఎవరైనా గెలుచుకున్నదానికన్నా పోగొట్టుకున్నదే ఎక్కువగా ఉంటుంది" అని టెక్నికల్ ఎక్స్‌పర్ట్, 'కంప్యూటర్ ఎరా' మ్యాగజైన్ ఎడిటర్ నల్లమోతు శ్రీధర్ అన్నారు.

నిజానిజాలేమైనా డబ్బులు పెట్టి ఆడే ఏ ఆట విషయంలోనైనా జాగ్రత్త అవసరమే. వినోదానికి, వ్యసనానికి మధ్య తేడాను గుర్తించి తదనుగుణంగా నడుచుకుంటే 'కింగ్'లానే బతికేయొచ్చు. లేదంటే ఎదుటివారి ముందు 'జోకర్'లవుతారు జాగ్రత్త.

**- చల్లా**





# నా ఇష్టం




కంప్యూటర్‌కి
వైరస్ వచ్చింది బాస్!


భారీ దోపిడీలు చెయ్యాలని
నాకూ ఉంది. మరి పాలిటిక్స్‌లోకి
ఎంట్రీ ఎలా?


చాలా పాపులర్ పత్రికలే
కిలోకి రూపాయి కన్నా
ఎక్కువ ఇవ్వటంలేదమ్మా
మీకని ఇస్తున్నా!!


ప్లీజ్ డాడీ నాకూ
వయస్సై పోతోంది
నాకు మాత్రం ఛైర్మన్
కావాలని ఉండదా?
ఛైర్మన్


బుద్ధిగా ఉండు
సోఫా ఎక్కకు
ఇల్లంతా సీసీ కెమెరాలు
పెట్టి చచ్చాడు!

# సప్త సముద్రాలు దాటి...

## బ్రోక్‌పాలతో ఒక పూట



Pregnency chasers! Pregnency tours!

**లాంటి చిత్రమైన శీర్షికలు పెట్టి జర్మనీ దేశపు యువతులు నిఖార్సయిన ఆర్యజాతి సంతానం కోసం లదాక్ సందర్శిస్తున్నారన్న వార్తలను పత్రికలు ప్రచురించకపోయి ఉంటే ప్రకృతి ఒడిలో నిమ్మళంగా మనుగడ సాగిస్తున్న దాబేమా, హను, గార్కొండ్, దార్చిక్ గ్రామాల పేర్లు బయటి ప్రపంచానికి తెలిసేవి కావేమో! లదాక్ పర్యటన అనుకోగానే మా బృందం కూడా ఈ పల్లెల్లో దేన్నయినా చూడాలని ఆశపడింది.**

"సార్ ఈ రోజు 'బ్రోక్‌పా'లను చూడ్డానికి వెళ్తున్నాం!" అని మా గైడ్ చేతన్‌డోల్మా మేము కార్గిల్ చేరిన మర్నాడే అంది. బ్రోక్‌పాలనే మాట వినబడగానే నిన్నటి సుదీర్ఘ ప్రయాణం- శ్రీనగర్ నుంచి కార్గిల్‌కు- బడలిక మటుమాయమై మాలో నూతనోత్సాహం పుట్టుకొచ్చింది. ఉదయం పది గంటలకు కార్గిల్‌లో బయలుదేరిన కారు ఆకాశాన్నంటే మహాపర్వతాల అంచున చీమలాగా ముందుకు సాగింది. భయాన్ని గుండెల్లోనే అణచిపెట్టుకొని ప్రకృతిచోద్యాలకు విస్తుపోతూ, ఆనందిస్తూ మధ్యాహ్నం పన్నెండు గంటలకు పల్లె - పట్నం ఏదీకాని మూల్‌బాక్ అనే చిన్న ఊరు చేరాం. ఆ ఊరి పొలిమేరలో ఒక పర్వతశిల మీద చెక్కబడిన 32 మీటర్ల మహోన్నత మైత్రేయ (బుద్ధ) విగ్రహాన్ని, విగ్రహం పాదాల వద్ద రెండంతస్థులుగా నిర్మించిన ఆలయాన్ని దర్శించి లదాక్ పర్యటన మొదలుపెట్టాం.

దాబేమా ఊరి గవినిలో, మిలిటరీ ఔట్‌పోస్టు సమీపంలో మా కారు ఆగింది. మా గైడ్ అక్కడి అధికారులకు అవసరమైన పత్రాలు, పర్మిషన్‌లు చూపించినా, ఒక సాయుధ సైనికుడు కారు దగ్గరకు వచ్చి మా వివరాలన్నీ అడిగి తెలుసుకొని సంతృప్తి చెందాకే ఊళ్ళోకి అనుమతించాడు. ఊరు వెలుపలే కారు దిగి మట్టి రోడ్డులో నడిచి వెళ్ళాం. దారికి ఒకవైపు లోయ, మరోవైపు బండరాళ్ళు, మట్టితో నిర్మించిన ఇళ్ళు, కొన్ని రెండంతస్తుల మిద్దెలు ఉన్నాయి. ఇళ్ళ వెనక పెరడును ఆనుకొనే సింధూనది నుంచి మళ్ళించిన పిల్ల కాలువ ఒకటి ప్రవహిస్తోంది. కాలువ అవతల చిన్న చిన్న కయ్యలు, మళ్ళల్లో ఏవో పైర్లు. కాలువలో కొందరు గృహిణులు బట్టలుతుకుతూ కనిపించారు. ఇళ్ళ మధ్య, సందుల్లో ఫలవృక్షాలు. ఎండకు ఆరబోసిన ఆప్రికాట్ పళ్ళు. ఊరి మధ్య హైస్కూలు, హాస్టలు. చెల్లాచెదురుగా విసిరేసినట్టు అక్కడక్కడా ఇళ్ళు, బౌద్ధ సన్యాసుల మఠం. స్టేజికి వెనుక కనిపించారు. ప్రకృతి దృశ్యాన్ని చిత్రించిన తెర దింపినట్లు ఊరి చివర ఎత్తయిన పర్వతాలు, అగాధమైన లోయలు. ఆ ఊళ్ళో వంద కుటుంబాల దాకా బ్రోక్‌పాలుంటారని ఒక టీచరమ్మ చెప్పింది.

### గ్రంథస్థం కాని చరిత్ర

ఈ నాలుగైదు గ్రామాల ప్రజలను లదాకీలు స్థానికేతరులు అనే అర్థంలో బ్రోక్‌పాలని వ్యవహరిస్తారు గాని, వీళ్ళు మాత్రం తాము 'మినారో'లమని చెప్పుకొంటారు. ఇటీవల ఈ మాట పాతపడి, తాము ఆర్యజాతికి చెందిన ప్రజలమని చెప్పుకొంటున్నారు. పార్వతేయులైన (Hill people) వీళ్ళు రెండు మూడు వేల సంవత్సరాలుగా జన్‌స్కర్-సింధూ నదుల పరీవాహక ప్రాంతంలో కొండమ్మ కోనమ్మ సందిళ్ళలో ప్రశాంతంగా బతుకుతున్నారు. ఈ జాతిజనుల చరిత్ర ఎక్కడా గ్రంథస్థం కాలేదు. తమ మూలాలను మరిచిపోయిన వీరి పాటల్లో, వృద్ధుల జ్ఞాపకాల్లో నిక్షిప్తమైన చరిత్రనంతా ఇప్పుడు పరిశోధకులు తవ్వి వెలికి తీస్తున్నారు. కాశ్మీరీ, లదాకీ ప్రజలకన్నా విశిష్టమైన సుందర స్ఫురద్రూపం ఉంది వీళ్ళకు. తెల్లని నిర్మలమైన శరీర వర్ణం, నీలికళ్ళు, బంగారు రంగు కురులు మొదలైన లక్షణాలతో యూరోపియన్లను తలపిస్తుండడం వల్ల వీళ్ళను పాశ్చాత్య పండితులు ఆర్యులని భావించారు. అలెగ్జాండరు సైన్యం వెనుదిరిగిపోయే సమయంలో కొంతమంది గ్రీకులు లదాక్ ప్రాంతంలో నిలబడిపోయారని, వాళ్ళ సంతతే మినారోలనే అభిప్రాయం చాలాకాలం ఉండేది కాని జన్యుపరీక్షల్లో అది వీగిపోయింది. మొత్తం మీద మినారోలకు, యూరోప్‌వాసులకు






మధ్య పోలికలున్నట్లు మాత్రం తేలింది.

దాబేమా ప్రజల భాష మీర్‌మో మాకు రాదు, మా భాష వాళ్ళకు రాదు. చిరునవ్వులతో మాట్లాడుకున్నాం. అయితే ఇంటిముందు అంగట్లో కూర్చుని ఉన్న ఒక పదిహేడేళ్ళ అమ్మాయి మమ్మల్ని పలకరించి లోపలికి రమ్మని ఆహ్వానించింది. తను జమ్మూ కాలేజీలో చదువుతోందట. వేసవి సెలవులకు వచ్చింది. తన పేరు సోనమ్ ఆర్యన్ (పేరు మార్చాం) అని చెప్పింది. తండ్రి సైన్యంలో పనిచేస్తాడట. సోనమ్ పెరటి తోటలో పని చేసుకుంటున్న తల్లిని వెంటబెట్టుకుని వచ్చింది. మమ్మల్ని చూసేందుకు క్షణాల్లో ఇరుగు పొరుగు యువతులు అక్కడ చేరారు. సోనమ్ టీ తయారు చేసి ఇచ్చింది మేకపాలతో. ఆర్యన్‌లు ఆవుపాలు, వెన్న, చివరకు పేడ కూడా వినియోగించరట! సోనమ్ వివరించింది. సోనమ్ కాస్త సిగ్గరి. చాలా మితంగా మాట్లాడుతుంది. అయినా మా వాళ్ళడిగిన ప్రశ్నలన్నిటికీ ఓపిగ్గా సమాధానాలు చెప్పింది. అంతేకాదు... మా బృందంలోని మహిళలు, సోనమ్ మిత్రబృందం నిమిషాల్లో కలిసిపోయి పాత స్నేహితుల్లా కబుర్లు చెప్పుకోసాగారు. సోనమ్, మా గైడ్ డోల్మా దుబాసీలుగా వ్యవహరించారు కనుక.

మినారోలు బౌద్ధధర్మాన్ని స్వీకరించకముందు 'బొన్' (BON) మతాన్ని అనుసరించేవాళ్ళు. ప్రకృతిని, సూర్యచంద్రులను, లాహ్ (Lah) అనే దేవుణ్ణి ఆరాధించేవాళ్ళు. ఇప్పుడు కూడా లాహ్ దేవుడి జాతర జరిపి, మేకలు బలి ఇస్తారు. లదాక్ ప్రజలు అనుసరించని పండుగలు, పబ్బాలు జరుపుతారు. శుద్ధ శాకాహారులు, గుడ్లు, చేపలు కూడా తినరు. పండుగల్లో మాత్రం మేకమాంసం తింటారు.

## టోపీలలో మాంతీ పూలు

ధగధగ మెరిసేట్లు తోమిన ఇత్తడి పాత్రలు, రాగి చరవలు, బిందెలు ప్రతి మినారో వంటింట్లో అందంగా పేర్చి ఉన్నాయి. వంటిళ్ళు వీళ్ళకు అతి పవిత్రమైన ప్రదేశాలు. దుష్ట శక్తులను ఇంట్లోకి జొరబడనివ్వకుండా లోహాలు అడ్డుకుంటాయని మినారోల విశ్వాసం. పాటలన్నా, పువ్వులన్నా వీళ్ళకు ప్రాణం. ఇళ్ళల్లో రకరకాల పూలచెట్లు పెంచుతారు. మినహాయింపు లేకుండా స్త్రీ పురుషులందరూ తమ టోపీలను రకరకాల పూలతో అలంకరించుకొంటారు. బెర్రీ జాతికి చెందిన షార్లో లేదా మాంతీ అనే పూలను టోపీలలో తప్పనిసరిగా అలంకరించుకుంటారు. టోపీకి ఈ పువ్వు లేకపోతే ఏదో అశుభం జరిగినట్లు ఎదుటివారు భావిస్తారట! పునిస్త్రీలు ఎర్రని గాజుపూసల దండను కంఠానికి ధరిస్తారు. మినారోల సమాజంలో మంత్రగాడికి, వైద్యుడికి, పూజారికి చాలా ప్రాధాన్యం ఉంది. జ్యోతిష్కుడికి కూడా. అతనే సౌరమానం ప్రకారం మంచి రోజులు చెప్తాడు.

14 వేల పైచిలుకు అడుగుల ఎత్తులో ఉన్న దాబేమా గ్రామంలో బార్లీ, గోధుమ, 'ఛా' అనే పైరు సాగుచేస్తారు. కూరగాయలు, దుంపలు పండిస్తారు. మేకలు, గొర్రెలు సాకుతారు. శుభాశుభ కార్యాల్లో, పండుగ రోజుల్లో బార్లీతో తయారుచేసిన 'ఛాంగ్' అనే మద్యం సేవిస్తారు. ప్రపంచీకరణ గాలులు బలంగా వీచి పాత అలవాట్లు, సంప్రదాయాలు తుడిచిపెట్టుకునిపోతున్న ప్రస్తుత సందర్భంలో కూడా కాలానికి ఎదురీదుతూ వీళ్ళు తమ జీవన


సోనమ్ ఆర్యన్‌తో వ్యాసకర్త సహచరి


సంప్రదాయ దుస్తులతో ఉన్న ఆర్యన్లతో వ్యాసకర్త


దాబేమాలో ఆర్యన్ల ఇళ్ళు

వైవిధ్యాన్ని కాపాడుకోవడానికి తంటాలు పడుతున్నారు. తరతరాలుగా రక్షించుకుంటూ వస్తున్న జాతి స్వచ్ఛతను నిలబెట్టుకోడానికి మినారోలు తమ సమాజంలో తప్ప బయటివాళ్ళతో వివాహ సంబంధాలు చేసుకోరు. వీళ్ళలో విడాకులు, పునర్వివాహాలు తప్పు కాదు. మగవాడు ఇద్దరు ముగ్గురు స్త్రీలను పెళ్ళాడడం, స్త్రీ తన పెనిమిటి సోదరులను కూడా భర్తలుగా స్వీకరించడం (Polyandry) ఉంది. అయితే ఈ పద్ధతులు క్రమేణా కనుమరుగవుతున్నాయి.

"జూలే, జూలే"

మా గైడ్ వీడ్కోలు చెబుతూ సమావేశం ముగిసినట్లు సూచించింది. "మీకు లే పట్టణంలో కాలేజీలు లేవా?" చివరిప్రశ్న అడిగాను. "ఉండడానికి ఉన్నాయి. అందరికీ సీట్లు రావు. చాలామందిమి జమ్మూ, ఇతరచోట్ల చదువుకొంటున్నాం. ఫీజులు, ఫ్లైటు ఛార్జీలు చాలా ఖర్చవుతోంది" సోనమ్ ఆర్యన్ వివరించింది. చదువుల మీద ఇక్కడి ప్రజలకున్న శ్రద్ధను అభినందించకుండా ఉండలేకపోయాను.

"జూలే, జూలే"

మేమూ సెలవు తీసుకోక తప్పలేదు. సోనమ్ ఆర్యన్ అంగట్లో పెప్సీబాటిళ్ళు, బిస్కట్ ప్యాకెట్లు, ఇతర వస్తువులు కొనుక్కొన్నాం, అంతగా అవసరం లేకపోయినా. సోనమ్ తల్లి మాకందరికీ ఎండబెట్టిన కొన్ని ఆప్రికాట్ పళ్ళు బహూకరించింది. సోనమ్ స్నేహితురాళ్ళు కూడా జూలే, జూలే చెప్పారు సంతోషంగా. Market economy నీలినీడలు ఈ గ్రామం మీద సోకినా, మానవ సంబంధాలు పదిలంగానే ఉన్నట్లనిపించింది.

"సార్ మీ ఊళ్ళో సముద్రం ఉందా" కారెక్కుతుంటే అమాయకంగా అడిగాడు ఒక గ్రామీణుడు.

"ఊర్లో లేదు కాని దగ్గర్లో ఉంది. మా ఊరొస్తే తప్పకుండా చూపిస్తాను" నా సమాధానం.

"ఏం లేదు, మేం ఏడు సముద్రాలు దాటి ఇక్కడికొచ్చాం సార్!" అన్నాడతను.

- కాళిదాసు పురుషోత్తం
kalidasu.purushotham@gmail.com

"సమియా ఐ లవ్ యూ" ఆమె కళ్లల్లోకి చూస్తూ అన్నాడు అన్వర్.
"ఐ టూ... కానీ ఎటో ఎటో తిప్పి ఇంతదూరం తీసుకొచ్చావేం..."
"పెళ్లి రేపు చేసుకుందాం... ఈలోగా ఒక్కసారి..." అంటూ ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.
"అదంతా ఏం లేదు... పెళ్లయిన తర్వాతే ముద్దయినా, ముచ్చటయినా..."
ఖరాఖండిగా చెబుతూ అతడిని తోసేసింది.
"పెళ్లి చేసుకుందామన్నాను కదా... ప్లీజ్..."
"అబ్బా... విసిగించకు... ముందు పద ఇక్కడి నుంచి..." అంటూ లేవబోయింది.
అన్వర్‌లో ఆందోళన మొదలైంది. ఎలాగైనా సరే ఆమెను ఈ రోజు అనుభవించాలనుకున్నాడు.
"సమియా... ప్లీజ్ రా..." అంటూ బుజ్జగించడం ప్రారంభించాడు.
కానీ సమియా ససేమిరా అంది.
అన్వర్ ఆందోళన క్రమక్రమంగా ఆగ్రహంగా మారింది. అతడిలోని ఉన్మాది ఒక్కసారిగా బయటపడ్డాడు. అతడి ముఖంలో క్రమక్రమంగా రంగులు మారుతున్నాయి.

**రియల్ క్రైమ్ కహానీ-27**

# ప్రేమ పేరుతో...

హైదరాబాద్ శివారుల్లోని గండిపేట...
వీకెండ్స్‌లో అదొక హాలీడే స్పాట్...
ఆదివారం సాయంత్రం ఐదున్నరైంది...
బందోబస్తు విధుల్లో ఉన్న నార్సింగ్ పోలీసులకు ఒక ఫోన్ కాల్ వచ్చింది.
వెంటనే పోలీసు బృందాలు గండిపేట వైపు పరుగుతీశాయి.
రహదారి పక్కనే ఉన్న పొదల్లో రక్తం మడుగులో పడి ఉందో యువతి మృతదేహం.
నార్సింగ్ ఇన్‌స్పెక్టర్ రాంచందర్ రావు, ఏసీపీ గంగారెడ్డి సంఘటన స్థలానికి వెళ్లారు.
మృతురాలి వయస్సు 20 ఏళ్ల లోపు ఉండవచ్చని వారు అంచనా వేశారు.
"మెడ కోసి, తలపై బండరాయితో మోది దారుణంగా హత్య చేశారు" అక్కడి పరిస్థితులను అంచనా వేస్తూ అన్నారు ఏసీపీ.
"అవున్సార్... చేతులు కూడా కట్టేసి ఉన్నాయంటే, ఆమె పారిపోకుండా ముందే జాగ్రత్త పడ్డారు..." మృతదేహాన్ని చూస్తూ అన్నారు ఇన్‌స్పెక్టర్.
"అత్యాచారం జరిగిన ఆనవాళ్లు కనిపించడం లేదు. దేనికోసం హత్య చేసి ఉంటారు..."
"ఇక్కడికి దగ్గర్లో చాలా కాలేజీలున్నాయి. ప్రేమ వ్యవహారమేదైనా ఉండొచ్చు సార్..."
"సరే.. ముందు ఫార్మాలిటీస్ పూర్తి చేయండి"
"అలాగే సార్..."
కొద్దిసేపటికే మీడియా ఆ ప్రదేశానికి చేరుకుంది.
మృతదేహం పక్కనే ఒక చాక్లెట్ కవర్, స్కార్ఫ్, బురఖా, పూల డిజైన్‌తో ఉన్న చెప్పుల జత పడి ఉన్నాయి. హత్య జరిగిన ప్రదేశానికి దగ్గరలోనే ఇంజనీరింగ్ కాలేజీలు ఉండటంతో మరణించిన యువతి విద్యార్థిని అయి ఉండొచ్చనే అనుమానాలు వ్యక్తమవుతూ టీవీల్లో బ్రేకింగ్స్ మొదలయ్యాయి.

•••

నార్సింగ్ పోలీస్‌స్టేషన్‌లో మీటింగ్ మొదలయ్యింది.
"మరణించిన యువతి ఎవరో ఇప్పటిదాకా తెలియదు. హత్య జరిగిన ప్రదేశానికి వెళ్లడానికి కాలిబాట మాత్రమే ఉంది కాబట్టి అక్కడికి వారు బైక్ మీద వచ్చి ఉండొచ్చు. కానీ ఆమె ఎవరితో వచ్చిందో తెలియదు. అయితే, మనకు క్లూ దొరకడానికి ఒక అవకాశం ఉంది..."
"ఏమిటి సార్ అది..." ఉత్సాహం ఆపుకోలేక అన్నాడో పోలీస్.
"గండిపేటకు దారితీసే అన్ని ప్రధాన రహదారుల్లో సీసీ కెమెరాలు పెట్టించాం కదా. హత్య మధ్యాహ్నం సమయంలో జరిగి ఉండవచ్చు. అంతకు ముందు ఆ దారుల్లో ఉన్న కెమెరాల్లో ఉన్న దృశ్యాలను పరిశీలించాలి" అన్నారు ఏసీపీ.
"మనకు ఆధారం ఆ అమ్మాయి వేసుకున్న నీలిరంగు జీన్స్, చెప్పులు. బురఖా కూడా ఉంది కాబట్టి గుర్తించడం సులువవుతుంది. కాబట్టి వెంటనే రంగంలో దిగండి" అని ఇన్‌స్పెక్టర్ పోలీసులకు సూచనలు ఇచ్చారు.
"ఎస్ సర్..." అంటూ పోలీసులు బృందాలుగా విడిపోయారు.

•••




గండిపేటకు వెళ్లే దారి పొడవునా ఉన్న సీసీ కెమెరాల ఫుటేజీని జాగ్రత్తగా పరిశీలించారు పోలీసులు. వారి శ్రమ వృథా కాలేదు. హత్య జరిగిన ప్రదేశానికి కిలోమీటరు దూరంలోని ఒక కెమెరాలో, మూడు కిలోమీటర్ల దూరంలోని మరో కెమెరాలో ఆ రోజు మధ్యాహ్నం నమోదైన దృశ్యాలు కేసు దర్యాప్తును మలుపు తిప్పాయి.
ఆరె మైసమ్మ గుడి ముందున్న కెమెరా ఫుటేజ్‌లో బైక్ మీద యువతీయువకులు వెళ్తున్న దృశ్యం కనిపించింది. ఆ యువతి నిండుగా బురఖా వేసుకోవడంతో ముఖం మాత్రం కన్పించలేదు. అయితే నీలిరంగు జీన్స్, చెప్పులు కొద్దిగా కనిపిస్తున్నాయి. బైక్ వేగంగా వెళ్లడంతో యువకుడి ముఖం గుర్తించలేకపోయారు పోలీసులు. హత్య జరిగిన ప్రదేశానికి కిలోమీటర్ దూరంలో ఉన్న రెండో ఫుటేజ్‌లో వాళ్లిద్దరూ మళ్లీ కనిపించారు. బైక్ మీది యువకుడు అరటిపళ్ల బండి వద్ద ఆపి ఏదో అడగటం, బండి అతను చేత్తో గండిపేట వైపు దారి చూపించడం స్పష్టంగా రికార్డు అయ్యింది.
"ఆ దృశ్యాలకు సంబంధించిన వీడియో క్లిప్‌ను వెంటనే మీడియాకు పంపించండి" అని ఏసీపీ గంగారెడ్డి పోలీసులను ఆదేశించారు.

అంతే... మరికొద్దిసేపట్లో అన్ని చానళ్లలోనూ యువతి హత్య గురించిన వివరాలను తెలుపుతూ బైక్ మీద వాళ్లిద్దరూ వెళ్లిన దృశ్యాలు పదేపదే ప్రసారమయ్యాయి.

మరోవైపు పోలీసులు సోషల్ మీడియాను కూడా బాగా వాడుకున్నారు. ఆ దృశ్యాలను వాట్సప్, ఫేస్‌బుక్‌లలో షేర్ చేశారు. ఆ యువకుడ్ని గుర్తిస్తే యువతి హత్య కేసు వివరాలు తెలుస్తాయన్న సమాచారం విస్తృతంగా సోషల్ మీడియాలో ప్రచారమైంది.

●●●

పోలీసుస్టేషన్లో ఇన్‌స్పెక్టర్ రాంచందర్‌రావు కేసు గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

బైక్ మీద కూర్చున్న యువతి తన ఇష్టంతోనే ఆ యువకుడితో వెళ్లినట్లు విజువల్స్ స్పష్టం చేస్తున్నాయి. అలాంటప్పుడు ఆమెను అతను ఎందుకు హత్య చేశాడు? అతను అరటిపళ్ల బండివద్ద గండిపేటకు దారి అడుగుతున్నాడంటే ఈ ప్రాంతానికి కొత్తవాడై ఉంటాడు. సో... నమ్మకంగా తనతో వచ్చిన యువతిని హత్య చేశాడంటే వారిద్దరి మధ్య ఏదైనా ప్రేమ గొడవ ఉండొచ్చు...

ఆయన తీవ్ర ఆలోచనలో ఉండగానే ఫోన్ రింగయ్యింది.

అవతలి నుంచి హంతకుడి సమాచారం రావడంతో ఆయన ఒక్కసారిగా రిలీఫ్‌గా ఫీలయ్యారు. మీడియాలో, సోషల్ నెట్‌వర్క్‌లో విస్తృతంగా ప్రచారం చేయడం వల్ల మేలే జరిగింది. హంతకుడిని కనిపెట్టేందుకు మార్గం సుగమం అయ్యింది. వెంటనే పోలీసులకు ఆ సమాచారం అందించి అలెర్ట్ చేశారు ఇన్‌స్పెక్టర్. దాంతో వారు తక్షణమే యాక్షన్‌లోకి దిగారు.

●●●

నార్సింగ్ పోలీసుస్టేషన్ విలేఖరులతో కిక్కిరిసిపోయింది.

ఏసీపీ గంగారెడ్డి, ఇన్‌స్పెక్టర్ రాంచందర్ రావు కేసు వివరాలను వెల్లడించడం ప్రారంభించారు.

"గండిపేట వద్ద హత్యకు గురైన యువతి పేరు సమియా. హైదరాబాద్ పాతబస్తీలోని నూరినగర్‌కు చెందిన సమియా తండ్రి కారుడ్రైవర్‌గా పనిచేస్తున్నాడు. ఆమెను హత్య చేసిన అన్వర్ కూడా అదే బస్తీకి చెందిన వాడు. సమియా ఇంటి దగ్గర్లో ఉండే అన్వర్ చిల్లరమల్లర దొంగతనాలు చేసేవాడు. సమియా తండ్రితో అతనికి పరిచయం ఉండటంతో తరచూ వీరి ఇంటికి వచ్చేవాడు. సమియాతో మెల్లిగా పరిచయం పెంచుకున్నాడు అన్వర్. మాయమాటలు చెప్పి ప్రేమిస్తున్నాను అన్నాడు. అయితే సమియా తండ్రి వీరి కదలికలను గమనించి ఇద్దర్నీ మందలించాడు. మనం ఇక్కడుంటే పెళ్లిచేసుకోవడం కష్టమని సమియాను నమ్మించాడు అన్వర్. ఆదివారం రోజున సమియా కుటుంబసభ్యులు ఏదో పని మీద బంధువుల ఇంటికి వెళ్లారు. అవకాశం కోసం ఎదురుచూస్తున్న అన్వర్ మెల్లిగా సమియా ఇంటికి చేరుకున్నాడు. ఇదే మంచి అవకాశం మనం పారిపోయి పెళ్లిచేసుకుందామని నమ్మబలికాడు. ఇంట్లో బంగారం, డబ్బు ఉంటే తీసుకుని రమ్మని చెప్పాడు. అతడి మాటలు నమ్మి సమియా బీరువాలో తండ్రి దాచిన ఏడువేల నగదు, తల్లికి చెందిన నాలుగుతులాల బంగారు ఆభరణాలను తీసుకుని అన్వర్ బైక్ ఎక్కింది.

మార్గమధ్యంలో 'ముందుగా మనం గండిపేటకు వెళ్లి అక్కడ కాసేపు గడిపి తర్వాత నా ఫ్రెండ్ రూమ్‌కు వెళ్దాం. రేపు పెళ్లి చేసుకుందామ'ని నమ్మబలికాడు అన్వర్. గుడ్డిగా నమ్మిన సమియా అతడ్ని హత్తుకుని బైక్‌పై కూర్చుంది. అన్వర్ తన బైక్‌ను నిర్మానుష్యమైన ప్రాంతానికి మళ్లించాడు. అక్కడ సమియాను మాయమాటలు చెప్పి లొంగదీసుకోవాలని చూశాడు. అయితే సమియా అతడికి లొంగలేదు. దాంతో అన్వర్ ఒక్కసారిగా ఉన్మాదంతో ఊగిపోయాడు. ముందుగా సమియాను కిందపడేసి స్కార్ఫ్‌తో ఆమె చేతులు కట్టేశాడు. ఆమె అరవడంతో జేబులోంచి చాకు తీసి గొంతుపై గాటుపెట్టాడు. ఆ తర్వాత పక్కనే ఉన్న బండరాయి తీసుకుని సమియా తలపై మోది హత్య చేశాడు. సమియా మెడలో ఉన్న బంగారు గొలుసును, ఆమె పర్సులోని డబ్బును, బంగారాన్ని తీసుకుని అక్కడి నుంచి పారిపోయాడు అన్వర్" అన్నారు ఏసీపీ గంగారెడ్డి.



**ఆరె మైసమ్మ గుడి ముందున్న కెమెరా ఫుటేజ్‌లో బైక్ మీద యువతీయువకులు వెళ్తున్న దృశ్యం కనిపించింది. ఆ యువతి నిండుగా బురఖా వేసుకోవడంతో ముఖం మాత్రం కన్పించలేదు. అయితే నీలిరంగు జీన్స్, చెప్పులు కొద్దిగా కనిపిస్తున్నాయి. బైక్ వేగంగా వెళ్లడంతో యువకుడి ముఖం గుర్తించలేకపోయారు పోలీసులు. హత్య జరిగిన ప్రదేశానికి కిలోమీటర్ దూరంలో ఉన్న రెండో ఫుటేజ్‌లో వాళ్లిద్దరూ మళ్లీ కనిపించారు.**

"హంతకుడు అన్వరే అని ఎలా గుర్తించారు?" ఒక విలేఖరి ప్రశ్నించాడు.

"సీసీ కెమెరాల్లో లభించిన దృశ్యాలు మీడియాలో రావడం, సోషల్ మీడియాలో కూడా సర్క్యులేట్ కావడంతో పాతబస్తీలోని ఒక యువకుడు అన్వర్‌ని గుర్తించాడు. మరోవైపు గండిపేట దగ్గర గుర్తు తెలియని ముస్లిం యువతి హత్య జరిగిందని ఆమె దుస్తుల వివరాలు పోలీసులు వెల్లడించడంతో సమియా తండ్రి రాత్రి 12 గంటల ప్రాంతంలో మమ్మల్ని సంప్రదించారు. ఈ రెండు వివరాలను విశ్లేషిస్తే హంతకుడెవరో కన్‌ఫర్మ్ అయ్యింది. రాత్రంతా గాలించి స్నేహితుడి ఇంట్లో దాక్కున్న అన్వర్‌ను ఎట్టకేలకు పట్టుకున్నాం. ప్రేమమైకంలో పడి ఓ యువతి నిండు ప్రాణాలను కోల్పోయింది. ప్రేమ అంటూ వెంటపడేవారిపట్ల యువతులు అప్రమత్తంగా ఉంటే ఇలాంటి సంఘటనలు జరగవు" అంటూ ఇన్‌స్పెక్టర్ రాంచందర్ రావు విలేఖరుల సమావేశాన్ని ముగించారు.

నోట్: పాత్రల పేర్లు మార్చి రాయడం జరిగింది.

**- వేముల సత్యనారాయణ, 99854 88800**

# ట్రావెలింగ్ గాడ్జెట్స్..

## డోట్లింగ్ గార్డియన్ (doettling guardian)



జ్యూవెలరీ వంటి విలువైన, వాచీ, గ్లాసెస్ వంటి సున్నితమైన వస్తువులను తీసుకెళ్లేందుకు ఉపయోగపడుతుంది ఈ 'డోట్లింగ్ గార్డియన్'. గాజు వస్తువులు పగిలిపోకుండా ఉండేందుకు ప్రత్యేకంగా పట్టీలను ఇచ్చారు. ఈ పట్టీలకు బిగించి కడితే బ్యాగు ఎన్ని కుదుపులకు గురయినా లోపలి వస్తువులకు ఏమీ కాదు. అంతేకాకుండా కోడ్ ద్వారా మాత్రమే ఓపెన్ అయ్యే విధంగా లాకర్ సౌకర్యం కూడా ఉంది. బ్యాగ్ పోయినా, దొంగిలించినా వేరెవరూ తెరవడానికి లేకుండా రూపొందించారు. స్పోర్ట్స్ కిట్ బ్యాగ్ ఆకారంలోనే ఉంటూ మరింత గుండ్రంగా, దృఢంగా తయారుచేసిన దీన్ని బైకులో, కారులో, విమానాల్లో కూడా తేలికగా తీసుకు పోవచ్చు.

## ట్రావెలింగ్ పిల్లోస్ (travelling pillows)

బస్సు ప్రయాణాల్లో ఎదురయ్యే సమస్యల్లో మొదటిది సరిగ్గా నిద్రపట్టకపోవడం. మెడను ఒక పక్కకు వాల్చి నిద్రపోయేందుకు వీలుగా సీట్లు ఉండవు. మెడను ఎటు వాల్చాలో తెలియక ఎటు పడితే అటు వాల్చేసి నిద్రపోవడం మన దేశంలో సగటు ప్రయాణికుడికి అలవాటే. అయితే ఇలా నిద్రపోవడం వల్ల తీవ్రమైన మెడ నొప్పి వస్తుంది. అంతేకాకుండా మధ్యమధ్యలో వచ్చే హారన్, ట్రాఫిక్, వాహనాల శబ్దాలతో నిద్రకు ఆటంకం కలుగుతుంది. ఈ 'ట్రావెలింగ్ పిల్లోస్' ఆ ఇబ్బందులను తొలగిస్తాయి. మెడను ఒక పక్కకు వాల్చేందుకు అనువుగా మాత్రమే కాదు బయటి శబ్దాలు వినిపించకుండా చెవులను; ఎండ, లైటింగ్ పడకుండా కళ్లను, తలను పూర్తిగా కవర్ చేసే ఈ పిల్లోస్ ప్రయాణాల్లో మంచి నిద్రకు బాగా ఉపయోగ పడతాయి.



ఈ వస్తువులను వాటి పేరుతో నెట్‌లో సెర్చ్ చేసి, వివిధ ఆన్‌లైన్ సంస్థల ద్వారా కొనుగోలు చేయవచ్చు.




## స్మార్ట్ క్యారి- ఆన్ సూట్‌కేస్ (smart Carry-On Suitcase)

ప్రస్తుత పరిస్థితుల్లో స్మార్ట్‌ఫోన్ జేబులో లేకుండా బయటికి అడుగు పెట్టే పరిస్థితి లేదు. యువత శరీరంలో ఒక భాగంగా మారిపోయాయి ఈ స్మార్ట్‌ఫోన్స్. అయితే దూరప్రయాణాలు చేసేటప్పుడు ఫోన్ బ్యాటరీ చార్జింగ్ పెద్ద సమస్యగా మారుతుంది. పవర్‌బ్యాంక్స్ ఉన్నప్పటికీ వాటి ద్వారా వచ్చే చార్జింగ్ ఎక్కువ సేపు ఉండదు. ఆ ఇబ్బందులను దూరం చేస్తుంది ఈ 'స్మార్ట్ క్యారి-ఆన్ సూట్‌కేస్'. మొబైల్ చార్జ్ చేసుకునేందుకు వీలుగా ఈ సూట్‌కేస్ వెనకాల చార్జర్ పిన్స్ ఇచ్చారు. దీని ద్వారా మొబైల్ మాత్రమే కాదు ల్యాప్‌ట్యాప్ కూడా చార్జింగ్ చేసుకోవచ్చు. సీక్రెట్ పిన్ ద్వారా లాక్ చేసే సౌకర్యంతో పాటు జీపీఎస్ ద్వారా ఎక్కడున్నామో, వెళ్లాల్సిన ప్రదేశానికి ఎంత దూరంలో ఉన్నామో తెలుసుకునే అధునాతన టెక్నాలజీని కూడా ఈ స్మార్ట్ సూట్‌కేస్ కల్పిస్తోంది.





ఇంటెక్

## మైక్రో త్రీ ఇన్ వన్ లగేజ్ స్కూటర్ (Micro 3 in1 Luggage Scooter)





కొన్ని ప్రాంతాలకు వెళ్లేందుకు ఎటువంటి రవాణా సౌకర్యాలు ఉండవు. అటువంటప్పుడు నడక మీదే ఆధారపడి ప్రయాణం సాగించాల్సి ఉంటుంది. ఆరోగ్యంగా ఉన్నవాళ్లకైనా సరే ఎక్కువ దూరం నడిస్తే అలసట, కాళ్లనొప్పులు రావడం సహజం. అలాంటి సమయాల్లో మీ అలసటను దూరం చేసేందుకు ఉపయోగపడుతుంది ఈ 'మైక్రో త్రీ ఇన్ వన్ లగేజ్ స్కూటర్'. లగేజ్‌ను మోసే ఇబ్బంది లేకుండా కింద బిగించిన రెండు చక్రాల ద్వారా బ్యాగును తోసుకుపోవచ్చు. అలాగే ఎక్కేందుకు వీలుగా మరో చక్రంతో స్కేటింగ్ ప్యాడ్ బిగించారు. ఈ స్కేటింగ్ ప్యాడ్‌పై నించొని హ్యాండిల్ ద్వారా కంట్రోల్ చేస్తూ ఎంత దూరమైనా స్కేటింగ్ చేస్తూ హాయిగా వెళ్లిపోవచ్చు. అంతేకాకుండా ఎత్తైన ప్రదేశాలకి వెళ్లినపుడు వీపుకు తగిలించుకునేందుకు అనువుగా పట్టీలు కూడా ఇచ్చారు. తరుచూ ప్రయాణాలు చేసేవారికి ఈ లగేజ్ స్కూటర్ ఎంతో ఉపయోగపడుతుంది.









**మనోజ్ వంశీ**
శ్రీ భావన విద్యానికేతన్
7వ తరగతి, క్రాంతినగర్,
విశాఖపట్టణం

# బేతాళ ప్రశ్న - 10

ఒక రెస్టారెంట్‌లో పార్టీ జరుగుతోంది. గ్రాండ్ పార్టీ కావడంతో వచ్చే అతిథులందరికీ ఒక కోడ్ ఇచ్చారు. గేట్ దగ్గరుండే సెక్యూరిటీ గార్డు అడిగిన ప్రశ్నకు సరైన సమాధానం చెబితేనే లోపలికి పంపిస్తున్నారు. మొదట వచ్చిన వ్యక్తితో సెక్యూరిటీ గార్డు ఇంగ్లీషులో '12' అన్నాడు. వచ్చిన వ్యక్తి '6' అని చెప్పి లోపలికి వెళ్లాడు. రెండో వ్యక్తితో సెక్యూరిటీ గార్డు '6' అన్నాడు. ఆ వ్యక్తి '3' అన్నాడు. ఇదంతా గమనిస్తున్న సురేష్ లోపలికి వెళ్లాలనుకొని గేటు దగ్గరికి వచ్చాడు. సెక్యూరిటీ గార్డు '4' అన్నాడు. సురేష్ '2' అన్నాడు. సెక్యూరిటీ గార్డు కోడ్ తప్పని గ్రహించి అతడిని లోపలికి పంపించలేదు. సురేష్ చెప్పింది తప్పని అతను ఎలా కనిపెట్టాడు?

**సమాధానం వచ్చేవారం!**

**మీ దగ్గర ఇలాంటి మెదడుకు మేతవేసే ప్రశ్నలు, భేతాళ ప్రశ్నలు ఉంటే సమాధానంతో పాటు మా ఈమెయిల్ kerintha.aj@gmail.com కు పంపించగలరు**



**గతవారం సమాధానం: "e"**
సంవత్సరంలో (year) ఒకసారి, వారంలో (week) రెండు సార్లు వస్తుంది. అలాగే రోజుల్లో (monday to sunday) మూడు సార్లు, నెలల్లో (january to december) 11 సార్లు "e' వస్తుంది.

**బేతాళ ప్రశ్న- 8 కి సరైన సమాధానాన్ని పంపిన మొదటి ముగ్గురు:**
ఎం. ప్రసాద్, ప్రశాంత్ తలారి (ఈమెయిల్), హరీశ్‌చౌదరి, శ్రీకాళహస్తి

# మీకు తెలుసా!



1. ప్రపంచంలో అతిచిన్న పండు యుట్రికల్. అది ఒక మిల్లీమీటరు కన్నా చిన్నది.
2. డైనోసార్ల కాలంలో రోజుకి 23 గంటలే ఉండేవి.
3. చక్కెరను తొలిసారి తయారు చేసింది భారతీయులు.
4. స్పానిష్ జాతీయ గీతంలో పదాలుండవు.
5. థాయ్‌లాండ్‌లో గాలి పటాలు ఎగరేయడం.. వృత్తిగా గుర్తింపు పొందిన క్రీడ

# కన్నీటి కొండలు



పచ్చని పంటపొలాల నడుమ ముదురు గోధుమ రంగులో మెరిసిపోతున్న ఈ కొండలు ఫిలిప్పైన్స్‌లోని బొహోల్‌లో ఉన్నాయి. నిజానికి ఇవి పచ్చగడ్డిని కప్పుకున్న లైమ్‌స్టోన్ కొండలు. వేసవిలో గడ్డి ఎండిపోయినప్పుడు ఈ కొండలు చాక్లెట్ రంగులోకి మారతాయి. యాభై కిలోమీటర్ల చదరపు పరిధిలో ఇలాంటివి దాదాపు 1776 కొండలు ఉన్నాయి. వీటి వెనుకో జానపద కథ ఉంది. 'అరగో' అనే ఓ మానవాతీత యువకుడు (మన పురాణాల్లో చెప్పుకునే గంధర్వ పురుషుడులాంటి వాడు) సాధారణ కన్య అయిన 'అలోయా'తో ప్రేమలో పడతాడు. దురదృష్టవశాత్తూ ఆమె అనారోగ్యంతో మరణిస్తుంది. ఆ బాధ తట్టుకోలేక అరగో కన్నీరుమున్నీరుగా విలపిస్తే ఆ కన్నీళ్లు ఘనీభవించి ఇలా చాక్లెట్ కొండల్లా ఏర్పడ్డాయట!

# బ్రెడ్ హౌస్




ఇక్కడ ఫోటోలో కనిపిస్తున్న ఇంటిని ఇటుకలతో కట్టారనుకుంటే మీరు పొరబడినట్టే! దీనిని నోరూరించే కేకులతో కట్టారు. ఈ ఇల్లు ప్రపంచంలోనే అతిపెద్ద జింజర్ బ్రెడ్ హౌస్‌గా గిన్నిస్ రికార్డుల కెక్కింది. యుఎస్‌ఏలోని టెక్సాస్ రాష్ట్రంలో ట్రెడిషన్స్ క్లబ్ దీనిని నిర్మించింది. జింజర్ బ్రెడ్ అంటే... అల్లం, జాజికాయ, తేనె, పంచదారలతో రంగరించి కాల్చిన బ్రెడ్. పశ్చిమ దేశాల్లో ఇది చాలా పాపులర్ స్నాక్. దాదాపు 60 అడుగుల పొడవు, 42 అడుగుల వెడల్పు, 10 అడుగుల ఎత్తు ఉన్న ఈ బ్రెడ్ హౌస్ నిర్మాణం వెనుక... సెయింట్ జోసెఫ్ ఆసుపత్రిలో మరో ట్రామా సెంటర్‌ని నిర్మించి ఇవ్వాలన్న మహోన్నత ఆశయం దాగుంది.

# మేయర్ పిల్లిగారు

అలస్కాలోని టల్కీట్నా (Talkeetna) అనే చిన్న పట్టణానికి పందొమ్మిది సంవత్సరాలుగా మేయర్‌గా ఉంటోంది స్టబ్స్ అనే మార్జాలం. అసలు పిల్లి మేయర్‌గా పని చేయడమేంటి? అదెలా సాధ్యం? అనుకుంటున్నారా.. అదే చెప్పబోతున్నాం. లారీ అనే జనరల్ స్టోర్స్ మేనేజర్‌కు 1997 ఏప్రిల్‌లో కొన్ని పిల్లి పిల్లలు కనిపించాయి. వాటిలో తోకలేని ఓ పిల్లి పిల్లను పెంచుకోవడం మొదలు పెట్టిందామె. కొద్దికాలంలోనే ఆ పిల్లి పట్టణవాసులంద రికీ మచ్చికై పోయింది. ఇంతలో మున్సిపల్ ఎలక్షన్లు రావడం, సరైన వ్యక్తులెవరూ నిలబడక పోవడంతో నాయకులకు బుద్ధి చెప్పడానికి ఈ పిల్లిని మేయర్‌గా నిలబెట్టి గెలిపించుకున్నారు టల్కీట్నా వాసులు. దాని పేరు మీద ఫేస్‌బుక్‌లో, ట్విట్టర్‌లో అకౌంట్ ఓపెన్ చేసి స్థానికులే పాలనా వ్యవహారాలు చూస్తున్నారు. అలా 1997 జులై 18 నుంచి అంటే దాదాపు పందొమ్మిదేళ్లుగా మేయర్‌గా ఉంటోంది స్టబ్స్. ఈ మధ్యే ఓ కుక్క దానిపై దాడి చేస్తే ప్రజలు విరాళాలు పోగేసి మరీ తమ పిల్లి మేయరుగారికి చికిత్స చేయించారు. ఈ మేయర్ పిల్లి... పర్యాటకులను కూడా బాగా ఆకర్షిస్తోంది.






# రంగులు వేయండి



# చుక్కలు కలపండి

# దారి కనుక్కోండి



# 'మోనాలిసా'కు నకలు



ప్రపంచంలోని క్లాసిక్ పెయింటింగ్స్ కొన్నింటిని పునఃసృష్టించాలనుకున్నారు కొందరు. అందులో భాగంగా లియోనార్డో డావిన్సీ ఎవర్‌గ్రీన్ పెయింటింగ్ మోనాలిసా చిరునవ్వుకు డిజిటల్ రూపాన్ని ఇవ్వాలనుకున్నారు. ఒక ఫోటోగ్రాఫర్, ఒక స్టయిలిస్టు, ఒక మేకప్ ఆర్టిస్టుతో కలిసి బ్రిటిష్ డిజిటల్ ఆర్టిస్టు క్వెంటిన్ డివైన్ టీమ్‌గా ఏర్పడి, మోనాలిసాను పోలిన ఒక మోడల్‌ను గుర్తించారు. వారంతా తమ సృజనతో ఆమెను మోనాలిసాగా తీర్చిదిద్ది, పెయింటింగ్‌లోని రంగుల ప్రకారం లైటింగ్ ఏర్పాటుచేసి, ఫ్రేమ్ కంపోజ్ చేసి ఒరిజినల్ పెయింటింగ్‌లాగే ఫోటోలు తీశారు. ఒక్కో పోర్ట్రయిట్‌కు వారికి 36 గంటల సమయం పట్టిందట. రైడర్స్ ఆఫ్ ది లాస్ట్ (lost) ఆర్ట్ అనే కొత్త టీవీ షోలో భాగంగా ఈ ప్రాజెక్టును వారు డిజైన్ చేశారు. ప్రపంచ ప్రసిద్ధి చెందిన పెయింటింగులను డిజిటల్ టెక్నాలజీ సాయంతో రీక్రియేట్ చేయడం నిజంగా అద్భుతమే అంటున్నారు కళాభిమానులు.



అవీ ఇవీ

# 'కొండ'చిలువ దారి

కొండ మీద ఒక కట్టడం నిర్మించాలనుకున్నారు. కానీ ఆ నిర్మాణానికి కావాల్సిన వస్తువులను అక్కడికి చేరవేయడం ఎలా? అందుకే కొండమీదికి ఒక తాత్కాలిక రోడ్డును వేశారు. ఇక్కడ అనేక మలుపులతో 'కొండ' చిలువలా కనిపిస్తున్న రోడ్డు అదే. చైనాలోని సిచువాన్ ప్రాంతంలో 630 మీటర్ల ఎత్తున్న ఒక పర్వతం మీద నిర్మాణం కోసం జరిగిన ప్రయత్నం ఇది. సుమారు 8.9 కిలోమీటర్ల పొడవు... 24 మలుపులున్న ఈ తాత్కాలిక రోడ్డును 14 నెలల్లో సుమారు 5 కోట్ల రూపాయలు ఖర్చు చేసి వేశారట. ఈ రోడ్డు మీదుగా లారీల్లో నిర్మాణానికి సంబంధించిన సామాగ్రిని కొండపైకి చేరవేశారట. ఎంతో క్లిష్టతరమైన మార్గమైనా ఒక్కటంటే ఒక్క ప్రమాదం కూడా రికార్డు కాకపోవడం విశేషం.






## హెపటైటిస్, హెర్పిస్‌ల కట్టడి

**హెపటైటిస్** వైరస్ శరీరంలోకి ప్రవేశించిన వెంటనే లక్షణాలు బయటపడవు. రోగలక్షణాలు కనిపించడానికి చాలా ఏళ్లు పడుతుంది. కొంతమందిలో వైరస్ సోకిన 4 వారాలు లేదా 12 వారాల తరువాత కొన్ని రోగలక్షణాలు బయటపడతాయి. వైరస్ ఎప్పుడైతే కాలేయంపై దాడి చేస్తుందో అప్పుడు లక్షణాలు బయటపడతాయి. అంతవరకు ఇది సోకిన విషయం తెలియదు. ఆకలి తగ్గిపోవడం, వాంతులు, మూత్రం పచ్చగా రావడం, కళ్లు పసుపుపచ్చగా మారడం, జ్వరం, ఒళ్లు నొప్పులు అధికంగా ఉండటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. హెపటైటిస్-బి ఉన్న కొందరిలో లివర్ ఫెయిల్యూర్‌కు దారితీస్తుంది. కొన్ని ఏళ్ల నుంచి వైరస్ ఉన్నవారిలో కాలేయం క్రమంగా దెబ్బతింటూ లివర్ సిర్రోసిస్‌కు దారితీయవచ్చు లేక లివర్ క్యాన్సర్‌గా మారవచ్చు.

**హెర్పిస్ సింప్లెక్స్**

పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలిపుండు పడుతుంది. ఈసమయంలో చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి నొప్పిని కలిగిస్తాయి.

**హోమియో చికిత్స :** హెపటైటిస్, హెర్పిస్‌వ్యాధులను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టదు.

## సైనసైటిస్, టాన్సిల్స్‌కు శాశ్వత చికిత్స

**సైనసైటిస్, టానిల్స్..** రెండు వేరు వేరు వ్యాధులైనా రెండింటికి సంబంధం ఉంది. దీర్ఘకాలంగా సైనసైటిస్‌తో బాధపడుతున్నప్పుడు టాన్సిల్స్ సమస్య ఉత్పన్నమయ్యే అవకాశం ఉంటుంది. గొంతులో రక్షకభటుల్లాగా ఉండి బ్యాక్టీరియా, వైరస్, ఫంగస్ వంటి వ్యాధికారక క్రిములు శరీరంలోకి ప్రవేశించకుండా నిరోధిస్తూ దేహరక్షణకు తోడ్పడే లింఫ్ కణజాల సమూహమును టాన్సిల్స్ అంటారు. ముక్కుకు ఇరువైపులా ఉండే గదులను సైనస్‌లంటారు. టాన్సిల్స్ వాపు పిల్లల్లో సాధారణంగా కనిపించే సమస్య.

**లక్షణాలు :** తరచు జలుబు చేయడం, జలుబుతో ఎక్కువ రోజులు బాధపడటం అనేది సైనస్ వ్యాధి ప్రాథమిక లక్షణం. ఆ తరువాత దశలో జలుబు చేసినపుడు ముక్కులు బిగదీసుకుపోతాయి. తల అంతా బరువుగా ఉంటుంది. టాన్సిల్స్ వాపు ఉంటే గొంతునొప్పి, నోటి దుర్వాసన, గురక ఎక్కువగా పెట్టడం కనిపిస్తుంది. ప్రతి పది, పదిహేనురోజులకొకసారి దగ్గు, జలుబు లక్షణాలు కనిపిస్తాయి. వీటితోపాటు జ్వరం కూడా ఉంటుంది. గొంతునొప్పి ఉంటుంది. ఒక్కోసారి నొప్పి చెవి వరకు విస్తరిస్తుంది.నోటిలో దుర్వాసన వస్తూ ఉంటుంది. గురక, నిద్రలో నోటితో గాలిపీల్చుడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. ఆహారం మింగడం కష్టమవడం వంటి లక్షణాలు ఉంటాయి

**హోమియోతో దూరం**

మూలకారణాన్ని తొలగించే విధంగా హోమియో వైద్యం ఉంటుంది. హోమియో చికిత్స తరువాత వ్యాధి తిరిగి రావడం అంటూ జరగదు. హోమియో మందుల్లో ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు. హోమియోతో సైనసైటిస్, టాన్సిల్స్ శాశ్వతంగా తగ్గుతాయి.

**Dr. K Ravikirane**
**M.D.,M.sc(psych), P.G(virology)LONDON**
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
**మాస్టర్స్ హోమియోపతి**
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



## హెచ్‌ఐవి సోకినా జీవితం ఉంది

**హెచ్‌ఐవికి** చికిత్స లేదా? హెచ్‌ఐవి సోకితే మరణమేనా! అంటే కానే కాదు. హెచ్‌ఐవి సోకినా అందరిలాగే సాధారణ జీవితం, ఆరోగ్యవంతమైన జీవితం గడపవచ్చు. ఎప్పటికీ ఎయిడ్స్‌గా మారకుండా చూసుకోవచ్చు. ఒక్కమాటలో చెప్పాలంటే హెచ్‌ఐవి వైరస్‌ను హోమియో మందులతో కట్టడి చేయవచ్చు.

**లక్షణాలు కనిపించడానికి....**

హెచ్‌ఐవి శరీరంలోకి ప్రవేశించగానే ఎటువంటి మార్పులు కనిపించవు. కొన్ని సంవత్సరాల తరువాత వ్యాధికి సంబంధించిన లక్షణాలు ప్రారంభవవుతాయి. అంటే సీడీ 4 కణాల సంఖ్య తగ్గిపోయిన తరువాత వ్యాధి లక్షణాలు కనిపిస్తాయి. హెచ్‌ఐవి శరీరంలో ప్రవేశించిన తరువాత ఎన్ని రోజులకు బయటపడవచ్చని అనేది వారి ఆహారపు అలవాట్లు, ఆరోగ్యస్థితి, ఇతర వ్యాధులపై ఆధారపడి ఉంటుంది. కొందరిలో ఐదారేళ్లకే సీడీ 4 కణాలు బాగా తగ్గిపోయి ఇన్‌ఫెక్షన్లు మొదలవుతాయి. మరికొందరిలో పదేళ్లు పడుతుంది.

**హోమియో చికిత్స ఎలా పనిచేస్తుంది**

హోమియో మందుల వల్ల సీడీ 4 కణాల సంఖ్య గణనీయంగా పెరుగుతుంది. అవకాశవాద ఇన్‌ఫెక్షన్లకు చోటు లేకుండా పోతుంది. ఆకలి బాగా పెరగడంతో బరువు పెరగడం ప్రారంభిస్తారు. హెచ్‌ఐవి అని తెలియగానే మరణం తప్పదనే భావనలో ఉంటారు. కానీ అది నిజం కాదు. హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా అందరిలాగే సాధారణ జీవితం గడిపే అవకాశం లభిస్తుంది. హెచ్‌ఐవి ఎయిడ్స్‌గా మారకుండా నిరోధించవచ్చు.. ఒకసారి హెచ్‌ఐవి సోకాక దాన్ని పూర్తిగా తొలగించే మందులు లేవు. అయితే హోమియో మందులతో వైరస్‌ల సంఖ్య అతి తక్కువ స్థాయికి చేరుకునేలా చేయవచ్చు.

## నడుంనొప్పితో జీవితం నరకమేగా?

**నడుం** నొప్పి మూలంగా ఏ పనీ చేసుకోలేకపోతారు. ఉదయం వేళ నొప్పి తీవ్రంగా ఉంటుంది. నొప్పి క్రమంగా నడుము నుంచి కాళ్లలోకి విస్తరిస్తుంది. దీర్ఘకాలంగా బాధపడే వారిలో శృంగార సమస్యలు కూడా ఎదురవుతాయి. కొందరిలో నొప్పి నడుం నుంచి మోకాళ్లు, పిక్కల ద్వారా అరికాళ్లు, కాలివేళ్ల దాకా వ్యాపిస్తుంది. దీన్ని సయాటికా అంటారు. వెన్నులో ప్రతి రెండు వెన్నుపూసల మధ్య కొంత ఖాళీ ప్రదేశం, ఒక సయాటిక్ నరం, పూసలను బంధించి ఉంచే కొన్ని కండరాలు ఉంటాయి. మన దైనందిన పనుల్లోని కొన్ని లోపాల వల్ల కొందరిలో ఈ పూసలను బంధించి ఉంచే కండరాలు బలహీనమవుతాయి. ఫలితంగా పూసల మధ్య సహజంగా ఉండవలసిన ఖాళీ తగ్గిపోతుంది. దీనివల్ల పూసల మధ్య ఉండే సయాటికా నరం ఒత్తిడికి లోనవుతుంది. దీనివల్ల ఆ నరం శరీరంలో ఎంత దూరం వెళితే అంత దూరం నొప్పి వస్తూనే ఉంటుంది.

**లక్షణాలు :** చాలా మందిలో కుడి వైపు నొప్పి ఎక్కువగా వస్తుంది. నడుము నొప్పి రావడం, కొద్దిగా శారీరక శ్రమ చేయగానే నొప్పి తీవ్రత పెరగడం, మొదట నడుము భాగంలో మొదలై క్రమేణా తొడ వెనక భాగానికి పాకుతుంది. తరువాత మోకాళ్లు, పాదాల చివరకు, పిక్కలు, మడమలకు వ్యాపిస్తుంది. కరెంట్ షాక్ కొట్టినట్లు నొప్పి వస్తుంది. తిమ్మిర్లు, మంట వంటి లక్షణాలు ఉంటాయి. కొన్నిసార్లు నడవడానికి, కూర్చోవడానికి, పడుకోవడానికి చాలా ఇబ్బంది పడాల్సి వస్తుంది.

**హోమియో చికిత్స :** నొప్పి ఏదైనా సమూలంగా తగ్గాలంటే హోమియో చికిత్స ఒక్కటే మార్గం. లుంబార్ స్పాండిలోసిస్, సయాటికా సమస్యలకు హోమియోలో అద్భుతమైన చికిత్స అందుబాటులో ఉంది. హోమియో మందుల ద్వారా నడుము నొప్పి, సయాటికా సమస్యను పూర్తిగా దూరం చేయవచ్చు.

ADVT




## నెంబర్ ప్లేట్లకు వేరు వేరు రంగులు...?



ప్రస్తుతం మన దేశంలో ఆరు రకాల నెంబరు ప్లేట్లు వాడుకలో ఉన్నాయి. వీటికి వేరు వేరు రంగులు ఉండటానికి కారణం.. వీటికి పన్ను వర్తించే విధానం వేరుగా ఉండటమే. అలాగే ఏదైనా ప్రమాదం సంభవించినపుడు లేదా ఏదైనా నేరం జరిగినప్పుడు అది ఏ కేటగిరీకి చెందిన వాహనమో తెలిగ్గా గుర్తించేందుకు నిర్దేశిత రంగుల్లోనే నెంబరు ప్లేట్లు ఉండాలని నిర్ణయించారు. ఆ ప్రకారం ఇండియన్ ఎంబసీకి సంబంధించిన వాహనాల నెంబరు ప్లేట్లు నీలం రంగులో ఉంటే.. సైన్యానికి సంబంధించిన వాహనాల నెంబర్ ప్లేట్లలో నలుపు బ్యాక్‌గ్రౌండ్‌పై తెల్లటి అక్షరాలు, నెంబర్లు ఉంటాయి. వాహన తయారీదారులు ప్రమోషన్ కోసమో, టెస్ట్ డ్రైవింగ్ కోసమో నడిపే వాహనాల నెంబరు ప్లేట్లు ఎరుపు రంగులో ఉండి వాటిపై తెల్ల అక్షరాలుంటాయి. వ్యక్తిగతంగా వాడుకునే వాహనాలకు తెల్లటి నంబరు ప్లేటుపై నలుపురంగు అక్షరాలు, నెంబర్లు ఉంటాయి. ప్రైవేట్ టాక్సీ, ఆటో, ట్రక్ వంటి వాహనాలకు పసుపు రంగు నెంబరు ప్లేటుపై నల్లక్షరాలు, అంకెలు ఉంటాయి. యజమాని స్వయంగా నడిపే కమర్షియల్ వాహనాలకు నలుపు బ్యాక్‌గ్రౌండ్‌లో పసుపు రంగు అక్షరాలు, అంకెలు ఉంటాయి.







## అవే రంగులు కనిపిస్తాయి...?



రెస్టారెంట్లలో, ఫాస్ట్‌ఫుడ్ సెంటర్లలో ఎక్కువగా ఎరుపు, నారింజ, పసుపు రంగులనే వాడతారు. ఈ ఎరుపు, నారింజ, పసుపు రంగులను వార్మ్ (warm) కలర్స్ అంటారు. ఇవి ఆకలిని పెంచుతాయని శాస్త్రీయంగా నిరూపితమైంది. అందుకే రెస్టారెంట్స్‌లో మెనూ దగ్గర నుంచి టేబుల్ క్లాత్ వరకూ అన్నీ ఈ మూడు రంగుల్లో ఉంటాయి. ఆహార పదార్థాలను ప్రదర్శించే బోర్డుల్లో కూడా ఈ కలర్స్‌నే వాడతారు.

## మిక్చర్ పొట్లం

బొమ్మలు : **చారి పి.యస్**

### మనవడి ప్రేమ



"ప్లీజ్ డాక్టర్ .. మా తాతయ్యని ఎలాగైనా బతికించండి.." చేతులు జోడించాడు సూరిబాబు.

"నిన్ను చూస్తే చాలా గర్వంగా ఉందోయ్. కన్న తల్లిదండ్రులనే కాదనుకునే కాలం ఇది. తాతగారి పట్ల ఇంత ప్రేమ గల వాన్ని నిన్నే చూశా.." భుజం తట్టాడు డాక్టర్.

"నా బర్త్‌డేకి ఆడి కారు గిఫ్ట్ ఇస్తానని తాతయ్య మాటిచ్చారు" కళ్లు తుడుచుకున్నాడు సూరిబాబు.

### దూరాలోచన

"ఏంటీ .. ఎన్ని సార్లు కాల్ చేసినా లిఫ్ట్ చేయట్లేదు?" నిలదీసింది ప్రేయసి.

"సారీ సరోజా .. మన ప్రేమ నుండి నేను డ్రాప్ అవుతున్నా. మా పక్కింటాళ్ల సంసారం చూశాక జీవితాంతం బ్రహ్మచారిగా ఉండాలని డిసైడ్ అయ్యా .." చేతులు కట్టుకుని బదులిచ్చాడు ప్రేమికుడు.

### మార్గం ఉంది




"నీకు సున్నా మార్కులు వచ్చాయి కదా .. ప్రోగ్రెస్ కార్డుని మీ డాడీకి ఎలా చూపిస్తావు .." అడిగాడు బంటి.

"ఆయన ఫేస్‌బుక్ చూస్తున్న టైంలో చూపిస్తే ... వెంటనే సంతకం చేస్తారు .." చెప్పాడు వెంకి.

### మాట పనిచేసింది

"మీరు ఏం మాట్లాడినా మీ ఆవిడ దించిన తల ఎత్తదటగా .. ఏం మాయచేశారు?" అడిగాడు సుబ్బారావు.

"నువ్వు తల ఎత్తితే యాభై ఏళ్ల పైబడ్డ దానిలా, తల దించితే పాతికేళ్ల పడుచులా ఉంటావని చెప్పాను .." బదులిచ్చాడు రాజారావు.

### భిన్న ధృవాలు

"నేను నాగార్జున అభిమానిని. ఎప్పుడూ కళ్యాణ్ జ్యూయలర్స్‌లోనే నగలు కొంటాను" భార్య.

"నేను వెంకటేశ్ అభిమానిని. అందుకే ముత్తూట్ ఫైనాన్స్‌లోనే నగలు తాకట్టు పెడతాను" భర్త.

## మా ఆవిడ బంగారం

"**బం**గారం .. తిన్నావా?"
"నీకేమైనా మెంటలా .. బంగారాన్ని ఎవరైనా తింటారా?"

## తొందరపడ్డానమ్మా!



"**దు**క్కలా ఉండే మనిషి .. ఇంత హఠాత్తుగా పోతాడనుకో లేదమ్మా .." ఓదార్చింది కామాక్షమ్మ.

"పాపిష్టిదాన్ని .. షాపింగ్‌కు వెళ్లిన రెండు నిమిషాల్లోనే చీర సెలక్ట్ చేశాను. ఆ షాక్ నుండి తట్టుకోలేకపోయారు" కళ్లు తుడుచుకుంది మీనాక్షమ్మ.

## ఆ ఆరూ కక్కండి!

**అ**ప్పుడే ఇంట్లోకి వచ్చిన భర్తను "ఆరూ తెచ్చారా?" నిలదీసింది అలివేలు.

"ఆరా .. " తెల్లబోయాడు శంభులింగం.

"ఈ రోజు మీ రాశిఫలంలో ఆదాయం 9, వ్యయం 3 అని ఉంది. వ్యయం పోగా మిగిలిన 6 ఏం చేశారని " విడమర్చింది అలివేలు.

" ... .... ... !" విస్తు పోయాడు శంభులింగం.

## నిజాయితీ పోలీస్



"**ఆ** ఇంట్లో దొంగ ఉన్నాడని తెలుసు కదా .. మరి ఎందుకు పట్టుకోలేకపోయావు" కోపంగా అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఆ ఇంటి ముందు 'ఇతరులు లోనకి ప్రవేశించరాదనే బోర్డుంది" వినయంగా బదులిచ్చాడు పోలీస్ వెంకటస్వామి.

## ఛాయా'చిత్రం'



'మూషికా స్వయంవరం'

## అన్నలూ జాగ్రత్త!

"**అ**న్ని దానాల్లో కెల్లా అన్నదానం గొప్పది. దాన్ని మీ పుట్టినరోజునాడు చేస్తే మరింత పుణ్యం వస్తుంది" చెప్పాడు ప్రవచన స్వామి.

"నాకు అన్న లేడు .. అంటే నాకు పుణ్యం రాదా స్వామీ?" అమాయకంగా అడిగాడు ఒక భక్తుడు.

ఈ వారం కవిత

# అస్తిత్వం



బొమ్మ : అక్బర్

**ఏ** వస్తుప్రేమ యంత్రలోకాలకో వలస పోలేక
ఈ దారెంట ఇలా మిగిలిపోతున్నాను
ఎదురుచూపులన్నీ నేలరాలిపోతున్నాయి
కమ్ముకొస్తున్న నిస్పృహ కనుగుడ్లను కప్పేస్తున్నది

నక్షత్రాల్ని కూడా నశింపచేయగల కాలం
రెక్క విరిగి కదల్లేక దీనంగా చూస్తున్నది
గాలినెవరో ఓ బుడగలో కూరి ఉరేసి
అనంతానికి వేలాడ తీసినట్లుంది
సూర్యుణ్ని కూడా భయపెట్టి దూరంగా తరిమేసే తంత్రమేదో
ఎదురుగా మోహరించినట్లుంది

ఈ దారెంట ఇలా మిగిలిపోతున్నాను
తడిలేని మాటలేవో
ఒళ్లంతా నిమురుతున్నాయి
రాబందు ఆకలేదో
ఆశగా చూస్తున్నది
పడగ విప్పిన పామేదో కాలే కోరికల్తో
మెదడులోకి సలసలా దూరిపోతున్నది
నీడతో సేద తీర్చాల్సిన చెట్టూ
గొంతుచుట్టూ ఊడల్ని బిగిస్తున్నది

అప్పుడప్పుడు
ఏవో వేలికొసలు
జుట్టులోకి సుతారంగా జొనిపినట్లనిపిస్తుంది
సుదూరాల్నుండి ఒక పిల్లనగ్రోవేదో
సనసన్నని తీగలై చర్మరంధ్రాల్లోకి ఇంకిపోతున్నట్లనిపిస్తుంది

ఆశగా కళ్లు తెరిచి చూస్తే
పెచ్చులూడిన కపాలం లాంటి భయంకర శూన్యం
రణగొణ ధ్వనులతో మీదిమీదికి దూసుకొస్తున్నది

– **అరణ్యకృష్ణ, 98499 01078**

# అనుగ్రహం

13-19 నవంబర్ 2016

డాక్టర్ పి.ఎ.రామన్



### మేషం : అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం

ఆర్థిక లావాదేవీలు మందకొడిగా సాగుతాయి. ఏ విషయంపై ఆసక్తి ఉండదు. ఆహ్వానాలు అందుకుంటారు. పనులు ముందుకు సాగవు. ఆత్మీయుల రాక ఉపశమనం కలిగిస్తుంది. ఖర్చులు అధికం. ఆదాయ మార్గాలు అన్వేషిస్తారు. దంపతుల మధ్య సఖ్యత లోపిస్తుంది. సానుకూలంగా సమస్యలు పరిష్కరించుకోవాలి. ప్రముఖులను కలుసుకుంటారు. వ్యాపారాభివృద్ధికి మరింతగా శ్రమించాలి. పెట్టుబడులు, వ్యాపారాల విస్తరణలకు తరుణం కాదు. ఉద్యోగ బాధ్యతల్లో ఏకాగ్రత వహించండి.



### వృషభం : కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు

లక్ష్యసాధనకు అవిశ్రాంతంగా శ్రమిస్తారు. యత్నాలకు పరిస్థితులు అనుకూలిస్తాయి. అయినవారితో ఉల్లాసంగా గడుపుతారు. సంతానం కదలికలపై కన్నేసి ఉంచండి. అవివాహితుల్లో ఉత్సాహం నెలకొంటుంది. వ్యవహారాలు పురోగతిన సాగుతాయి. పెద్దల గురించి ఆందోళన చెందుతారు. కార్యక్రమాలు వాయిదా వేసుకుంటారు. ఆది, సోమవారాల్లో పనులు సాగక విసుగు చెందుతారు. పత్రాలు, విలువైన వస్తువులు జాగ్రత్త. దైవదీక్షలు స్వీకరిస్తారు. వ్యాపారాలు ఊపందుకుంటాయి.



### మిథునం : మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు

రుణ బాధలు, అనారోగ్య సమస్యల నుంచి బయటపడతారు. ఆలోచనలు కార్యరూపం దాల్చుతాయి. కొత్త పనులకు శ్రీకారం చుడతారు. కలిసివచ్చిన అవకాశాన్ని తక్షణం వినియోగించుకోండి. మంగళ, బుధ వారాల్లో పంతాలు, భేషజాలకు పోవద్దు. లౌక్యంగా పనులు చక్కబెట్టుకోవాలి. శుభకార్యాల్లో పాల్గొంటారు. బంధువులకు మీ రాక సంతోషాన్నిస్తుంది. ప్రముఖులను కలుసుకుంటారు. సంప్రదింపులు ఫలిస్తాయి.



### కర్కాటకం : పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష

కొత్త విషయాలు తెలుసుకుంటారు. ఆలోచనలు నిలకడగా ఉండవు. ప్రతి చిన్న విషయానికి ఆందోళన చెందుతారు. ఆప్తులను కలుసుకోవాలనిపిస్తుంది. ఆదాయ వ్యయాలకు పొంతన ఉండదు. గురు, శుక్ర వారాల్లో పనులు అస్తవ్య స్తంగా సాగుతాయి. పెద్దలతో సంప్రదింపులు జరుపుతారు. వ్యవహార ఒప్పందాల్లో ఏకాగ్రత వహించండి. నూతన దంపతులు కొత్త అనుభూతికి లోనవుతారు. ఆరోగ్యం స్థిరంగా ఉంటుంది.



### సింహం : మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం

ఆశలొదిలేసుకున్న బాకీలు వసూలవుతాయి. విలాస వస్తువులు కొనుగోలు చేస్తారు. పరిచయాలు ఉన్నతికి తోడ్పడతాయి. కుటుంబీకులతో ఉల్లాసంగా గడుపుతారు. ఆలోచనలు కార్యరూపం దాల్చుతాయి. ఆంతరంగిక విషయాలు గోప్యంగా ఉంచండి. శనివారం నాడు పనుల సానుకూలతకు మరింతగా శ్రమించాలి. విందులు, వినోదాల్లో పాల్గొంటారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. మీ శ్రీమతి వైఖరిలో మార్పు వస్తుంది. ఉద్యోగస్తులకు అధికారులతో సాన్నిహిత్యం నెలకొంటుంది.



### కన్య : ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు

సంప్రదింపులు, ఆర్థిక లావాదేవీలు కొలిక్కి వస్తాయి. ఒక సమస్య సానుకూలమవుతుంది. మానసికంగా కుదుటపడతారు. ఆదాయానికి తగ్గట్టుగా ఖర్చులుంటాయి. ధనానికి ఇబ్బంది ఉండదు. పొదుపు పథకాల పట్ల ఆకర్షితులవుతారు. ప్రైవేట్ సంస్థల్లో మదుపు క్షేమం కాదు. స్థిరాస్తి కొనుగోలు దిశగా ఆలోచిస్తారు. పరిచయాలు, బంధుత్వాలు బలపడతాయి. కొత్త విషయాలు గ్రహిస్తారు. ఆది, సోమ వారాల్లో అతిగా ఆలోచించవద్దు. శుభకార్యాలకు హాజరవుతారు.



### తుల : చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు

పుణ్యక్షేత్ర సందర్శనలు సంతృప్తినిస్తాయి. కోరికలు, అవసరాలు తీరగలవు. సన్నిహితులకిచ్చిన మాట నిలబెట్టుకుంటారు. ఇంటా బయటా అనుకూలతలుంటాయి. ఆదాయం సంతృప్తికరం. ఖర్చులు భారమనిపించవు. అర్ధంతరంగా నిలిపివేసిన పనులు పూర్తి చేస్తారు. మంగళ, బుధ వారాల్లో ఇతరుల విషయంలో జోక్యం చేసుకోవలసి వస్తుంది. వ్యవహారాలు మీ చేతుల మీదుగా సాగుతాయి. ఆత్మీయులకు చక్కని సలహాలిస్తారు. ఉద్యోగ, వ్యాపార ప్రకటనల పట్ల ఏకాగ్రత వహించండి.



### వృశ్చికం : విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ

ఆర్థిక లావాదేవీలు నిరాశ కలిగిస్తాయి. మనస్థిమితం ఉండదు. ఖర్చులు విపరీతం. చెల్లింపులు వాయిదా వేసుకుంటారు. ఆశ్చర్యకరమైన సంఘటనలెదురవుతాయి. సన్నిహితులతో సంప్రదింపులు జరుపుతారు. ఆది, గురు వారాల్లో లౌక్యంగా పనులు చక్కబెట్టుకోవాలి. మీ అధిపత్యాన్ని ప్రదర్శించవద్దు. శ్రీమతి శ్రీవారి వైఖరిలో మార్పు సంభవం. అవివాహితుల్లో ఉత్సాహం నెలకొంటుంది. గృహ నిర్మాణాలు వేగవంతమవుతాయి. ఉద్యోగస్తులకు శ్రమాధిక్యత మినహా గుర్తింపు ఉండదు.



### ధనుస్సు : మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం

అభ్యంతరాలు, అభియోగాలు ఎదుర్కొంటారు. మీ ఆగ్రహావేశాలను అదుపులో ఉంచుకోండి. ఎవరినీ నిందించవద్దు. విమర్శించిన వారే మీ ఔన్నత్యాన్ని తెలుసుకుంటారు. పనులు నెమ్మదించినా అనుకున్న విధంగా పూర్తి కాగలవు. రావలసిన ధనంలో కొంత మొత్తం అందుతుంది. మంగళ, శని వారాల్లో ఖర్చులు అధికం. మీ శ్రీమతి సాయంతో ఒక సమస్య సానుకూలమవుతుంది. మీ అభిప్రాయాలను సున్నితంగా వ్యక్తం చేయండి.



### మకరం : ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు

అన్ని రంగాల వారికి యోగదాయకమే. ధనయోగం, వస్తులాభం, వాహన యోగం పొందుతారు. సర్వత్రా అనుకూలతలుంటాయి. ఖర్చులు విపరీతం. అయినవారి కోసం బాగా వ్యయం చేస్తారు. ఆహ్వానాలు అందుకుంటారు. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. గురు, శుక్ర వారాల్లో అవగాహన లేని విషయాల్లో జోక్యం తగదు. ఆధ్యాత్మికత, సేవాభావం పెంపొందుతాయి. వ్యాపారాలు ఊపందుకుంటాయి.



### కుంభం : ధనిష్ఠ 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు

పెట్టుబడులు, నూతన వ్యాపారాలకు అనుకూలం. సంప్రదింపులు ఫలిస్తాయి. చక్కని ప్రణాళికలు రూపొందించుకుంటారు. పనులు సానుకూలమవుతాయి. ఆత్మీయులకు సాయం అందిస్తారు. పరిచయాలు బలపడతాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. దంపతుల మధ్య అన్యోన్యత నెలకొంటుంది. శనివారం నాడు బాధ్యతలు అప్పగించవద్దు. ఖర్చులు అధికం, ప్రయోజనకరం. అవసరాలు, కోరికలు నెరవేరుతాయి. ఉపాధి పథకాల్లో నిలదొక్కుకుంటారు. దళారులను విశ్వసించవద్దు.



### మీనం : పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి

అనుకున్న లక్ష్యాలు సాధిస్తారు. ఒక వ్యవహారంలో ధనం అందుతుంది. ఖర్చులు సామాన్యం. కొంత మొత్తం పొదుపు చేయగల్గుతారు. పనులు సకాలంలో పూర్తి కాగలవు. కొన్ని విషయాల్లో మీ జోక్యం అనివార్యమవుతుంది. పెద్దల ఆరోగ్యం కుదుటపడుతుంది. సంతానం భవిష్యత్తుపై శ్రద్ధ వహిస్తారు. సంప్రదింపులు, ఒప్పందాలకు అనుకూలం. సన్నిహితులకు కీలక సమాచారం అందిస్తారు. ఉద్యోగస్తుల సమర్థతకు గుర్తింపు లభిస్తుంది. వ్యాపారాల్లో లాభనష్టాలు సమీక్షించుకుంటారు.

## అవునా!



రెండో ప్రపంచ యుద్ధంలో జాక్ చర్చిల్ అనే బ్రిటిష్ సైనికుడు ఆధునిక ఆయుధాలతో పాటు విల్లు, బాణాలను కూడా వాడాడు.

- కొన్ని రకాల ఆక్టోపస్‌లు జెల్లీఫిష్, లయన్‌ఫిష్ వంటి పదిహేను రకాల సముద్ర జీవుల గొంతులను అనుకరించగలవు.

- చరిత్రలో మొదటిసారి ధూమపానానికి వ్యతిరేకంగా ఉద్యమించింది నాజీలు.



రొయ్యలను ఎక్కువగా తినడం వల్లనే ఫ్లెమింగో పక్షులు పింక్ రంగులో ఉంటాయట.

- 18వ శతాబ్దంలో లండన్ జూని సందర్శించేవారు టిక్కెట్ కొనడానికి డబ్బులు లేకపోతే మేకనో, కుక్కనో ఇచ్చేవారు.

- రెండు తలల పాముల ఉనికి నిజమే. ఆ తలలు ఆహారం కోసం ఒకదానితో ఒకటి పోట్లాడుకుంటాయి కూడా.



కొన్నిరకాల దేవాంగి పిల్లులు (Sloths) చనిపోయాక కూడా చెట్టుకు వేలాడుతూనే ఉంటాయి. వాటి అస్థిపంజరాలు కూడా కింద పడవు.

- మన శరీరంలోని శరీర కణాల కంటే బ్యాక్టీరియా పదిరెట్లు ఎక్కువగా ఉంటుంది.

- వస్తువులను గాల్లో లేపడానికి ధ్వని తరంగాలను ఉపయోగించవచ్చు.

# అదృష్ట రత్నజ్యోతి


## రమేశ్చంద్ర మహర్షి

సెల్ : 92465 82255, ఫోన్ : 040-6522 5554


**ఆర్.ఎస్.ఎన్., ప్రొద్దుటూరు**

**మా అబ్బాయి జన్మకుండలి నిర్మొహమాటంగా వివరించగలరు.**

ఈ జన్మకుండలి ప్రకారం- నక్షత్రం విశాఖ. తులారాశి.

1. 23 నుండి 40 వయసు మధ్య బుధ దశ.
2. 40 నుండి 47 మధ్య కేతు దశ.
3. 47 నుండి 67 మధ్య శుక్ర దశ.
4. శని శుక్ర కుజుల వీక్షణ వలన విద్య ఇంజినీరింగ్. కుజ రాహువుల వీక్షణ వలన, అధిపతి వక్రించడం వలన, తృతీయాధిపతి సాంగత్యం వలన విద్యలో ఆశించినంత విజయం ఉండదు. అయితే అన్నిటికీ తానున్నా నంటూ విద్యనూ, వృత్తినీ ఒక మంచి స్థితిలో ఉంచడానికి పూర్వపుణ్యం లాకర్‌ల తాళాలు తన దగ్గరుంచుకున్న శుక్రుడు.
5. 23 నుండి 25 మధ్య బుధునిలో బుధుడు. ఈ భుక్తిలో మొదటి ప్రభుత్వోద్యోగం. దీనిలోనూ, ఆ పిదప ఒక ఏడాది నడిచే కేతు భుక్తి లోనూ ఇంకా విద్యా ఘడియలు నడుస్తాయి. అవి ఇంకా మంచి గవర్న్‌మెంట్ జాబ్ కోసం తీసుకునే కోచింగ్, కోర్స్‌లకు ఉపయోగపడతాయి.
6. 26 నుండి 29 మధ్య శుక్రుని భుక్తి. మాలవ్యా మహాపురుష యోగం. శుక్రునిలో శుక్రునిలో రవిలో... 27లో గ్రూప్ 1కి తక్కువ కాని ఉద్యోగం. 28లో... అంటే బుధునిలో శుక్రునిలో గురునిలో కళ్యాణ ఘడియలు. కానీ ఆ వెంటనే ప్రారంభమయ్యే శని విదశలో గండం. శనికి కూడా ఇక్కడ వివాహాన్నిచ్చే పోర్ట్‌ఫోలియో ఉంది. కనుక ఇక్కడి గండం తప్పించుకునే పరిహారం... గురుని విదశలో కాకుండా, శని విదశలో వివాహం చేసుకోవాలి.

ఎలాగూ సప్తమ శని వలన వివాహం 28లో అవుతుంది కూడా!

బృహస్పతిలో శుక్రుని ఫలితాలూ, శుక్రునిలో చంద్రుని ఫలితాలూ ఇంబైబ్ అయి కనబడుతున్నాయి కనుక వివాహం ప్రేమ వివాహం. అమ్మాయి కొలీగ్. రంగు చామనఛాయనే అయినా, కళ కలిగిన ముఖ మండలం.

ఏది ఏమైనా రాహువుకు గట్టి పరిహారాలు పాటించకుండా మాత్రం వివాహం చేసుకోకూడదు. పాటించకపోతే ఈ జాతకుని ఆయుర్దాయం బలహీనమవుతుంది.

ఇక గురువులో శుక్రుడు, శుక్రునిలో చంద్రుడు, చంద్రునిలో కేతువు ఫలితాలు ఇమిడి ఉండడం వలన ప్రథమ సంతానం 29లో... ఆడపిల్ల!

చాలా వృద్ధిలోకి రావడం జరుగుతుంది. అలాగే పేరుప్రతిష్ఠలు గడించడం ఉంటుంది. తండ్రికి రెండింతల స్థితి కలుగుతుంది.

7. 29 నుండి ఈ జాతకునికి ప్రారంభమయ్యే ధనయోగం.
8. 30లో బుధునిలో చంద్రాంతర్దశ. రెండవ సంతానం... పాప.
9. 31, 32లో ఉద్యోగ రీత్యా విదేశయానం.
10. 33 ప్రాంతంలో రాహుభుక్తి. యాక్సిడెంట్ కాకుండా గట్టి పరిహారాలు పాటించాలి. చంద్రుని అనుగ్రహం వలన తప్పించుకునే అవకాశం ఉంటుంది.
11. 35, 36 వయసులో బృహస్పతి భుక్తి. పరిహారాలు పాటించి రాహు భుక్తిలో తప్పించుకున్న యాక్సిడెంట్ ఈ భుక్తికి క్యారీ ఓవర్ అవుతుంది. అయితే యాక్సిడెంట్ కాకుండా మళ్ళీ పరిహారాలు పాటించాలి. వాటిలో ముఖ్యమైనది ముత్యాల హారం ధరించడం. ఇలా చేస్తే యాక్సిడెంట్, ఉద్యోగంలో తన కంటే తక్కువ స్థాయి ఉద్యోగితో అవమానం పాలు కావడం లాగా ట్రాన్స్‌లేట్ అవుతుంది. అదికూడా కాకుండా తప్పించుకోవాలంటే, పరస్త్రీల జోలికి ఊహల్లో కూడా వెళ్ళనంత నిష్ఠగా ఉండాలి.

కానీ ఈ పీరియడ్‌లో జరిగే తప్పించలేని విషయం... అన్యాయార్జితానికి అలవాటుపడడం.

ఇదే పీరియడ్‌లో జరిగే మరో సంఘటన, భార్యకు గండం కావడం.

12. అ) పరిహారాలు పాటించి భార్యను కాపాడుకుంటే, శని భుక్తిలో... అంటే 38 వయసులో ఆమె మెడలో పసుపు కొమ్ము కట్టి మళ్ళీ వివాహం చేసుకోవాలి.

ఆ) పరిహారాలు పాటించకపోవడం వలన భార్యకు ఏమైనా జరిగితే ఈ భుక్తి రెండవ వివాహాన్ని సూచిస్తుంది.

13. 40 నుండి 47 మధ్య కేతు దశ. 44లో ఏసిబి కేస్ లాంటిది.
14. 46లో క్లీన్ చిట్!
15. 47లో ప్రమోషన్. అప్పటినుండి ఎక్స్‌టెన్షన్‌తో కలిపి 65 వరకూ... మధ్యలో 54 నుండి 57 మధ్య కొన్ని లిటిగేషన్‌లు, లీగల్ మ్యాటర్స్ మినహాయిస్తే... వృత్తిలో మాలవ్యా మహాపురుష యోగం కలిగించే అసాధారణమైన స్థితి, ఐశ్వర్యం!!!

Advt

ఈ వారం కథ

# స్పేస్

అనూరాధ నాదెండ్ల

రాత్రి ఆలస్యంగా నిద్రపోయినా తెల్లవారకుండానే మెలకువ వచ్చేసింది. కిటికీ బయట నుండి వర్షం కురుస్తున్న శబ్దం తెలుస్తూనే ఉంది. గదంతా చల్లగా ఉంది. దుప్పటి దగ్గరగా లాక్కున్నాను. నిద్ర తేలిపోయాక పక్కమీద ఉండడం ఇష్టంగా ఉండదు.

పక్క గదిలో నిత్య ఉందన్న వాస్తవం దిగులు పుట్టిస్తోంది. పక్క మీంచి లేవాలన్న ఆలోచనని అది వెనక్కి లాగుతోంది. లేవాలి, ఆదివారమైనా పదో క్లాసు పిల్లలకి స్పెషల్ క్లాసుంది. ఏడున్నరకల్లా పనులు ముగించుకుని బయల్దేరాలి. మురళి అర్ధరాత్రి రైలుకి వచ్చి ఉంటాడు. నా నిద్రకి భంగం రానివ్వకూడదని కాబోలు డ్రాయింగ్ రూమ్‌లో దివాన్ మీద నిద్రపోతున్నాడు. నాలుగు రోజులుగా అతని కబుర్లు, సందడి లేక ఇల్లంతా చాలా నిశ్శబ్దంగా ఉంది. ఇవాళ ఆదివారం కనుక ఆ కబుర్లన్నీ వసూలు చేసుకోవాలి. నిత్య గదివైపు చూసి రాబోతున్న నిట్టూర్పుని అణచుకుని పనుల్లోకి ప్రవేశించాను. ఆలోచనలు వాటి దారిన అవి నడుస్తున్నాయి. ముప్పై ఏళ్ళు దాటిన కూతురి కోసం నాకెందుకు ఈ దిగులు?

జీవితాల్ని సవ్యంగా సాగనివ్వకుండా ఈ తరం ప్రతి మలుపులోనూ ఒక అశాంతితో కూలబడుతోంది. సవ్యంగా సాగనీయటమంటే ఏమిటని కదూ రాత్రి అడుగుతోంది. ఏమో, మా తరం అమ్మానాన్నల మాటల్నీ, ఆనక అత్తమామల మాటల్నీ విని బుద్ధిగా బ్రతికేసారు. అలా అంటే నిత్య "మీకంటూ ఒక స్పేస్ ఉండాలన్న ఆలోచన కూడా మీకు లేదు మరి" అని అంటుంది కాబోలు. నవ్వొచ్చింది ఆ ఆలోచనకి. నిజమే, అది లేకపోయినా పెద్దవాళ్ళు మంచి చెబుతున్నారన్న ఇంగితం ఉండేది. అది ఉందా ఇప్పటి తరంలో?!

సంజన లేచి వచ్చింది "అమ్మమ్మా, వానొస్తోంది... స్కూలుకెళ్ళను" అంది కళ్ళు నులుముకుంటూ. దాని సమస్య అదొక్కటే. నిండా మూడేళ్ళు లేవు. హాయిగా ఇంటిపట్టున ఆటలాడుకునే వయసు... అలా అంటే ఈపాటికి ఎప్పుడో స్కూల్లో చేర్చాల్సింది అంటుంది నిత్య. "ఈ రోజు ఆదివారం స్కూలు లేదు, తాతయ్య దగ్గర పడుకో" అంటూ సంజుని పంపేసాను.

టిఫిన్ డైనింగ్ టేబుల్ మీద సర్దుతుంటే మురళి లేచొచ్చాడు మనవరాల్ని నిద్రపుచ్చి. "ఏమిటి స్పెషల్ క్లాసా? వర్షంగా ఉంది. ఎవరైనా వస్తారా అసలు?" నిద్రకళ్ళతో అడిగాడు.

"ఆహా! మీ ఆవిడ క్లాసంటే తప్పక వస్తారు" అల్లరిగా నవ్వుతూ జవాబు చెప్పి, "ఇంకాసేపు పడుకోవచ్చుగా" అన్నా.

"నిన్ను స్కూల్ దగ్గర డ్రాప్ చేస్తాను" అన్నాడు.

"వద్దు, వర్షం పెద్దగా లేదు. హాయిగా బస్‌లో వెళ్తాను. తడిసిన రోడ్లు, తెరిచీ తెరవని చాయ్ దుకాణాలు... మెయిన్ రోడ్ మీద గుడి దగ్గర సందడి, చిరుజల్లుల్లో పట్టణాన్ని ప్రశాంతంగా దర్శిస్తూ వెళ్తే భలే ఉంటుంది, తెల్సా?" నేను అలా అనేసరికి మళ్ళీ నిద్రపోవడానికి వెళ్ళాడు. చుట్టూ పరికించేందుకు, అపరిచితుల మధ్య అప్రయత్నంగా కలిసే పలకరింపులు కాసిని మూట కట్టుకునేందుకు సిటీ బస్ ప్రయాణం బావుంటుందని అనిపిస్తుంది నాకు. మనిషి సంఘజీవి అని నిత్యం గుర్తు చేస్తూండే ఇలాటి అనుభవాలు ఎంత బావుంటాయి! మనుషుల మధ్య సంభాషణ అవసరం కదూ! అప్పుడప్పుడైనా మాత్రం డ్రైవింగ్ బాధ్యత తప్పించుకుని నిష్పూచీగా ఒక రైడ్‌ని ఆస్వాదించటం హాయిగా, స్వేచ్ఛగా... నాదైన స్పేస్‌లో... హ్హహ్హహ్హ. నిత్య ఏమంటుందో ఇలా చెబితే! కోపంతో ఓ చూపు చూడదూ?

తయారైనా ఇంకో పది నిమిషాలు ఆగి బయలుదేరొచ్చు అనుకుని వరండాలో కొచ్చాను. మరీ పెద్దది కాదు కాని వర్షం అలా నిలబడి కురుస్తూనే ఉంది. పూర్ణత్త చెప్పినట్టు 'కొట్టికురిసే' వాన కాదు. వాన చూస్తే పూర్ణత్త జ్ఞాపకం సహజంగా తోసుకొస్తుంది. నానమ్మ, తాతయ్యలకి ఆలస్యంగా పుట్టింది పూర్ణత్త. అత్తారింటికి వెళ్ళననీ, మళ్ళీ మళ్ళీ పంపొద్దని గొడవ పడుతూ ఉండటం ఊహ తెలిసిన పిల్లప్పట్నించి నాకు బాగానే జ్ఞాపకం ఉంది. అత్తయ్యని ఏడిపించద్దంటూ నేనూ నానమ్మకి చెప్పేదాన్ని.

"దానికి కూర్చుందుకు, నిలబడేందుక్కూడా స్వేచ్ఛ లేదనే సంసారాన్ని కాదని వచ్చేస్తోందిరా శీనూ, నీ చెల్లెలికి నచ్చచెప్పు" అంటూ నాన్నతో నానమ్మ చెప్పటమూ జ్ఞాపకమే నాకు.

"అమ్మలూ ఈ స్వేచ్ఛ ఏమిటి, ఎక్కడ నేర్చుకున్నావీ మాట? నీకేం లోటైంది? భర్తనీ, ఇంటినీ వదిలి ఇక్కడికొచ్చి ఏడిస్తే ఎలాగమ్మా?" అంటూ నాన్న చెప్పడమూ



బొమ్మలు : చారి పి.యస్.

తెలుసు.

"పోనీ, ఏ స్వేచ్ఛ వద్దు. నన్ను ఇక్కడుండనివ్వండి చాలు. ఎందుకో అక్కడ నాకు భయంగా ఉంటుంది. నిద్రపోదామన్నా భయమే. తినాలన్నా భయమే" అనేది అత్త.

"అతను ఒక్కమాటా నోరిప్పి మాట్లాడడుట శీనూ, ఇంటిల్లిపాదీ దీన్ని వెలివేసినట్టే చూస్తారట. ఒక్కరూ పలకరించరుట. వాళ్ళల్లో వాళ్ళు కబుర్లు చెప్పుకుంటూ అక్కడొక వ్యక్తి ఉందన్న ధ్యాసే లేనట్టు ప్రవర్తిస్తుంటారట. చెప్పుకు ఏడ్చింది. నాన్నగారి వరకు వెళ్ళనీయలేదివన్నీ నేను. ఆయన ఆరోగ్యం మరింత క్షీణిస్తుంది. దీని వైఖరి చూసి అంతో ఇంతో అర్థం చేసుకునే ఉంటారు ఆ మహానుభావుడు... 'అమ్మా, మనసు విప్పి మాట్లాడుకుందుకు ఒక్కరు కూడా లేకపోతే ఎలాగమ్మా. పెళ్ళయ్యే వరకూ చంటిపిల్లనంటూ మీరంతా ఎంత గారాబం చేసేవారు! నేను ఏం మాట్లాడినా ఒక వేదం లాగా వినేవారు కదా మీరంతా. నా స్నేహితురాలు వేణి నన్ను ఒక్క క్షణం వదిలి ఉండేదా? పగలంతా కబుర్లతోనే ఊపిరి పీల్చేదాన్ని... కబుర్లతోనే కడుపు నింపుకునేదాన్ని. ఇప్పుడు రాత్రి, పగలు ఒకటే నాకు. నోరిప్పి ఒక్క మాటా మాట్లాడాల్సిన అవకాశం, అవసరం లేదమ్మా' అంటూ బావురుమందిరా చంటమ్మ."

నానమ్మ కన్నీరు చూడలేక ముఖం తిప్పుకున్నారు నాన్న. భోజనం ముగించి అక్కడే కూర్చుండిపోయిన నన్ను అమ్మ చెయ్యి పుచ్చుకుని లేపి పెరట్లోకి తీసుకెళ్ళి చెయ్యి కడిగి పంపేసింది. ఇప్పుడు తలచుకుంటే ఎంత గుండెకోతగా ఉంటుందో!

పిల్లల్లేరన్న కారణంగా పూర్ణత్తకి అత్తవారింట్లో జరుగుతున్న అనుభవాలు నాన్నకీ, నానమ్మకీ అర్థం అయినా ఆమె తనదైన ఇంట్లో ఉంటేనే గౌరవమనీ, అదే సరైనచోటనీ మళ్ళీమళ్ళీ చెప్పి పంపిస్తూనే ఉండేవారు. ఆమె మానసిక గాయాలకి ఎవరూ ఎలాంటి లేపనాలు పూయనే లేదు. అలా పుట్టింటికీ అత్తింటికీ మధ్య తిరుగుతూ తిరుగుతూనే చిన్న వయసులోనే పూర్ణత్త మాయమైపోయింది. గతపు ఆలోచనలతో అంత చల్లని వాతావరణంలోనూ చెమటలు పట్టాయి.

బస్సెక్కి అలవాటైన పరిసరాల్నీ, రోజురోజుకీ వస్తున్న మార్పుల్నీ చూస్తూ కూర్చున్నాను. బస్టాపులో వాన నీటి మడుగులు తప్పించుకుంటూ రోడ్డుమీదే నిలబడి ఉన్నారు జనం. నేను బస్సు దిగేలోపు ఆ అరగంటలోనూ రోడ్డు మీద ట్రాఫిక్ పెరుగుతూనే ఉంది. కొత్తరకం మోటారు బైక్‌లు అంత రద్దీలోంచి కూడా తూనీగల్లా స్వేచ్ఛగా పరుగెడుతున్నాయి.

అబ్బ... ఈ పదం నన్నిలా పట్టుకుందేం! తెల్లవారకుండానే స్వేచ్ఛ గురించి తపించి, అందర్నీ వదిలి వెళ్ళిన పూర్ణత్త జ్ఞాపకమొచ్చింది... అది అలా మనసులో కదులుతూనే ఉంది. ఈ స్వేచ్ఛకి 'స్పేస్' కదూ ఈ తరం పెట్టిన పేరు. నిత్య ఏమంది మొన్న. "నాకేం చెప్పకు. చెబితే నీ అల్లుడికి చెప్పు. నాదైన స్పేస్‌ని నాకొదిలి నన్ను గౌరవించమని. దాన్ని నేను వదులుకోలేనమ్మా" అని కదూ!

రెణ్ణెల్ల క్రితం మురళి క్యాంప్‌లో ఉన్నప్పుడు తామిద్దరే ఉన్నాం కదా అని అడిగింది 'విషయం ఏమిటని?'

"పెళ్ళి పెళ్ళి అని గొడవ చేసేవుగా. నా వయసువాళ్ళు ఇప్పటికింకా పెళ్ళి చేసుకోలేదు. నాకేమో మూడో ఏడు పిల్ల..." విసుక్కుంటూ మరోమాటకి అవకాశమివ్వకుండా గదిలోకి వెళ్ళిపోయింది. నేను మళ్ళీ ఆ ప్రస్తావన తేలేదు. అల్లుడు శ్రీరామ్ ఫిర్యాదులేమిటో! అతని తల్లిదండ్రులు ఇవన్నీ గమనిస్తున్నారా? ఎక్కడో వేరే ఊళ్ళో ఉన్న వాళ్ళకి ఎలా తెలుస్తుంది? కళ్ళ ముందు ఉన్న కూతుర్ని చూస్తూ కూడా ఏమిటని అడగలేక తాము లేరూ? భలే చిత్రంగా ఉంటాయి జీవితాలు!

ఆరోజు శనివారం. సాయంత్రం శ్రీరామ్ వచ్చాడు. తండ్రి కారు దిగడం చూస్తూనే సంజు పరుగెత్తుకొచ్చింది 'పప్పా' అంటూ. కూతురు అతని ఒళ్ళో ఎక్కి కూర్చుని ఏవేవో అడుగుతున్నా అన్యమనస్కంగా జవాబు చెబుతున్నాడు. మంచినీళ్ళు, కాఫీ అందించి పలకరింపు ప్రశ్నలయ్యాక నిత్యని పిలిచే నెపంతో లోపలికెళ్ళాను. శ్రీరామ్ రావటం ఆ అలికిడి వింటూ ఉన్నా గదిలోంచి బయటకు రాలేదు. నేనేమంటానోనని లేచి వచ్చి డ్రాయింగ్ రూమ్‌లో కూర్చుందే కాని మొబైల్లో, వాట్సప్‌లో మునిగి ఉంది. అతనివైపు చూడనూ లేదు, పలకరించనూ లేదు. ఇదేమిటి? అతనూ చేతిలోని మొబైల్‌లోకే చూస్తున్నాడు. ఒళ్ళో కూర్చున్న చంటిది ఎప్పుడు ఒడి దిగి ఆటలకి వెళ్ళిపోయిందో! లేచి గుమ్మం బయటకొచ్చి కింద ఉన్న పార్క్‌లోకి నడిచాను. ఎందుకో గుండెలు గుబగుబలాడుతున్నాయి. నిత్య ఇక్కడికి వచ్చి నాలుగు నెలలయ్యాక అతను ఇప్పుడొచ్చాడు. ఇద్దరి మధ్యా కనీసం ఫోన్ కబుర్లైనా నడుస్తున్నాయో లేదో అనుమానమే. ఎలా ఈ పిల్లలతో? శ్రీరామ్ వచ్చినంత గంభీరంగానూ వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి నిత్య, శ్రీరామ్‌ల వ్యవహారం మురళితో చెబితే ఏమన్నాడు? "జనాలు ఈ రకం జీవితాలకి అలవాటుపడిపోయారు. మరో మనిషి తోడు వారికి అవసరం లేదులా ఉంది. మొన్న క్యాంపుకెళ్ళినప్పుడు నాతో వచ్చిన కొలీగ్ కృష్ణ... నువ్వు నమ్మవు. ప్రయాణంలో కానీ, అక్కడున్న రెండు రోజుల్లో కానీ ఒక్క మాట కూడా మాట్లాడలేదు. మెలకువగా ఉన్నంతసేపూ చప్పుడు లేకుండా ఫోన్‌లోనే ఉన్నాడు. పోనీ తనేమైనా చిన్న కుర్రాడా అంటే నాలుగేళ్ళల్లో రిటైరవుతాడు. ఇంతకీ ఎవరితో ఆ మౌన సంభాషణలు అంటే తను దాదాపు ఇరవై గ్రూపుల్లో మెంబరు. అందులో నాలుగింట్లో అడ్మిన్‌ట. రోజూ ఉద్యోగం ఎలా చేస్తున్నాడో అర్థం కాదు. అతని భార్య కూడా దాదాపు పగలంతా ఫోన్‌లో, నెట్‌లో ఉంటుందట. చాలా చురుగ్గా ఉంటుంది ఆమె అని గర్వంగా చెప్పాడు. రాత్రి పదికల్లా ఇద్దరూ ఫోన్ స్విచ్ ఆఫ్ చేసి పడుకుంటారట. లేకపోతే అసలు రెస్ట్ ఉండదని చెప్పాడు."

మురళి చెప్పేది వింటుంటేనే గాభరాగా అనిపించింది నాకు.

క్రితం నెల గుండెల్లో దడగా ఉంటోందని హాస్పిటల్‌కి వెళ్తే అనవసరపు ఆలోచనలు, యాంగ్జయిటీ తగ్గించుకోవాలని డాక్టర్ సలహా చెప్పాడు! ప్చ్! కాని ఎలా?

నిత్య కూతురుతో పాటు ఇంటికొచ్చిన రోజు గుర్తొచ్చింది. మర్నాడు ఇంటి దగ్గరే ఉన్న 'బచ్‌పన్'లో కూతుర్ని చేర్చేసి ఉద్యోగానికెళ్ళొస్తోంది. అప్పటిక్కానీ నాకూ మురళికి అర్థం కాలేదు విషయమేదో ఉందని. ఏదైనా మాట్లాడదామంటే, ఏదీ అసలు అవకాశం ఇస్తే కదూ. ఆఫీసు నుంచి వస్తూనే మొబైల్లో ఉంటుంది. ఫ్రెషప్ అయి తీరిగ్గా ల్యాప్ టాప్, ముందేసుకుని కూర్చుంటుంది. గ్రీన్ టీ పక్కనే నడుస్తూ ఉంటుంది. ఆఫీసు పని చూసుకుంటోందో ఏమిటో అనుకుంటూ సందేహంగా 'చిన్నీ, పని అవలేదా ఇంకా?' అంటే తలెత్తి 'ఉందు' అన్నట్టు సైగచేసి మళ్ళీ మొబైల్‌లోకో, ల్యాప్ టాప్‌లోకో వెళ్ళిపోతుంది. కింద కమ్యూనిటీ పార్కులో ఆడుకుని ఆకలేస్తోందంటూ సంజన తల్లి దగ్గరికి చేరినా, 'ఉష్' మాట్లాడకు, అమ్మమ్మ దగ్గరకెళ్ళు' అంటూ పంపించేస్తుంది. కాళ్ళు

**నిత్య కూతురుతో పాటు ఇంటికొచ్చిన రోజు గుర్తొచ్చింది. మర్నాడు ఇంటి దగ్గరే ఉన్న 'బచ్‌పన్'లో కూతుర్ని చేర్చేసి ఉద్యోగానికెళ్ళొస్తోంది. అప్పటిక్కానీ నాకూ మురళికి అర్థం కాలేదు విషయమేదో ఉందని. ఏదైనా మాట్లాడదామంటే, ఏదీ అసలు అవకాశం ఇస్తే కదూ. ఆఫీసు నుంచి వస్తూనే మొబైల్లో ఉంటుంది. ఫ్రెషప్ అయి తీరిగ్గా ల్యాప్ టాప్, ముందేసుకుని కూర్చుంటుంది.**

చేతులు కడిగి దానికి అన్నం తినిపించి, కథ చెప్పి నిద్రపుచ్చేసరికి తొమ్మిది అవనే అవుతుంది. ఏ కరెక్షన్ వర్కో చేసుకుంటూ కూర్చుంటే అలిసిన ముఖంతో మురళి వస్తాడు. వస్తూనే నా ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూస్తాడు. ఆ చూపుకి అర్థం తెలుసు నాకు. కానీ ఏం చెబుతాను? నిన్నటిలాగే ఉందీ రోజు పరిస్థితి కూడా. అంతే. ఏదైనా మాట్లాడదామని దగ్గర కూర్చున్నా చెవుల్లోంచి ఇయర్‌ఫోన్స్ తీయదు, ఫోన్లోంచి చూపు పైకెత్తదు. ఇదివరకైతే కనీసం ఎవరితోనైనా మాట్లాడుతున్నట్టు తెలిసేది. ఇప్పుడు వాట్సప్ పుణ్యమా అని అంతా నిశ్శబ్దమే. మౌనవ్రతాలే అందరివీ. నిత్య కాలేజీ చదువులప్పుడు కూడా ఇలాటి ప్రవర్తన లేదు. ఇప్పుడు, మరింత వయస్సు వచ్చి ఒక బిడ్డకి తల్లి అయి ఉండి... ఇదేమిటిలా?

పాఠం చెబుతున్నా మనసు నిండా ఇవే ఆలోచనలు.

క్లాసు ముగించగానే శశాంక్‌ను తీసుకెళ్ళేందుకు వచ్చిన అతని తండ్రి గబగబా నా దగ్గరకొచ్చాడు. “మేడమ్, మీతో ఒక్క నిమిషం మాట్లాడొచ్చా?” మొహమాటంగా అడిగాడు. శశాంక్ స్నేహితుల మధ్య కబుర్లలో ఉన్నాడు. “మీరంటే మా వాడికి చాలా గురి. అందుకే మీ చేత చెప్పించాలనుకుంటున్నా మేడమ్. వాడు పదో క్లాసు కొచ్చాక చాలా మార్పొచ్చింది. వాళ్ళ అమ్మ చెప్పిన మాట కానీ, నా మాట కానీ పట్టించుకోవడం లేదు. ఏదైనా చెప్పబోతే పెద్దవాడై పోయాననీ, ఏమీ చెప్పొద్దనీ అంటాడు. చదువును కూడా నిర్లక్ష్యం చేస్తున్నాడు. అదేమంటే చదువు, నా ఫ్రెండ్స్‌ను నేనే మేనేజ్ చేసుకుంటానంటున్నాడు. వాడికి అర్థమయ్యేలా మీరే చెప్పాలి.” నవ్వొచ్చింది. అలాగే అంటూ తలూపి అతన్ని పంపాను.



పొద్దున వర్షం తాలూకు ఆనవాళ్ళుగా గుంటల్లో చేరిన నీళ్ళు మాత్రమే మిగిలి ఎండ ధైర్యంగా వెలుగుతోంది. రోడ్లన్నీ బురదతో చికాగ్గానే ఉన్నాయి. పొద్దుటి దృశ్యం మారడంతో బస్సు ప్రయాణం అంత థ్రిల్‌ని ఇవ్వలేదు. ఆకలిగానూ ఉంది. మురళిని వెహికల్ తీసుకుని రమ్మని చెప్పి ఉండాల్సింది. కాస్త తమదైన సమయం దొరికేది ఆ కాస్త డ్రైవ్‌లోనూ. పాపం, క్యాంప్ పుణ్యమా అని ఇంటిని మిస్ అయి ఉంటాడు. వెనుక వెనుక తిరిగే మురళితో తనకీ సందడి అలవాటైపోయింది. చెల్లెలు భాను తామిద్దర్నీ చూసి తెగ విస్తుబోతుంటుంది. “మీ ఇద్దరికీ రోజూ ఇన్ని కబుర్లు ఎలా ఉంటాయక్కా” అంటూ. నిజమే, ఒక్కోసారి నోరు నొప్పి పుడుతోందంటూ కబుర్లకి కామా పెట్టే మురళి జ్ఞాపకం వస్తాడు.

ఇంటి గుమ్మంలోకి రాకముందే సంజన గొంతు ఏడుపుతో కలిపి వినిపిస్తోంది. “నేను పాలు తాగను” అంటూ తల్లి గదమాయింపులకి దీటుగా సమాధానం చెబుతోంది. “మూడేళ్ళు లేవు నిండా, దాని ఇష్టమే ఇష్టం. తాగదుట. సరే మానెయ్” అంటున్న కూతురి చేతిలోంచి గ్లాసు తీసుకున్నాడు మురళి.

“వద్దు నాన్నా, దాన్ని బలవంత పెట్టకండి” అంటున్న కూతుర్ని నవ్వుతూ చూస్తున్న మురళిని గమనిస్తున్నాను. అవును సంజు ఆ తల్లికి కూతురు కదా, దాని స్పేస్ దానిక్కావాలి మరి.

చెప్పులు విప్పి, కాళ్ళు కడుక్కుని వంటింట్లోకి నడిచేసరికి “ఏం కూర తరిగివ్వనూ” అంటూ మనవరాలితో పాలు తాగిస్తూనే మురళి వంటింటి ప్రవేశం చేశాడు. నాకు తెలుసు, నాకోసం నాలుగు రోజుల కబుర్లూ దాచిపెట్టాడని. ఆ మాటల ప్రవాహం నడుస్తూనే ఉంది. ఎంతసేపైందో! “మీ కబుర్లు మీవేనా? ఫోన్ మోగుతున్న విషయం గమనించరా?” అంటూ నిత్య అసహనంగా ఫోన్ అందించే వరకూ మాకు సమయమే తెలియలేదు. ఎన్నేళ్ళయినా మీ మధ్య కబుర్లు తరిగిపోవా అన్నట్టు చూస్తూ నిత్య వంటిల్లు దాటింది. నిత్య చూపు అర్థమైనా నా స్పేస్‌ని నేను వదులుకోదలచుకోలేదు.

.....................................................

**రచయిత్రి సెల్ : 73860 98516**

# ఏ ఆపిల్ మంచిది?

**సూ**పర్ మార్కెట్‌లో అమ్మే పళ్లు, కాయగూరలను గమనిస్తే వాటిపై ఏవో లేబుల్స్ అతికించి ఉంటాయి. కానీ చాలామంది వాటి గురించి పెద్దగా పట్టించుకోరు. ఆ లేబుల్... ఉత్పత్తి చేసేవాడికి, అమ్మేవాడికి మాత్రమే సంబంధించిన విషయంగా భావిస్తారు. నిజానికా లేబుల్ వినియోగదారుడు తను కొంటున్న వస్తువు ఎలాంటిదో తెలుసుకోవడానికి ఉద్దేశించినది.

ప్రస్తుతం ఎక్కడ ఎవరి నోట విన్నా ఆర్గానిక్ అనే మాట వినిపిస్తోంది. ఆర్గానిక్ కాయగూరలు, పళ్లు అంటే సేంద్రీయ ఎరువులు వేసి సహజ పద్ధతుల్లో పండించినవని మనకు తెలుసు. అందుకే అవి ఆరోగ్యానికి మంచివని కొంచెం ఖరీదు ఎక్కువైనా కొంటుంటాం. ముఖ్యంగా పళ్ల రసాలకి ఆర్గానిక్ పళ్లే శరణ్యం. ఎందుకంటే పళ్లరసాలు త్వరగా జీర్ణమై మన శరీరంలో కలిసిపోతాయి. ఆ పళ్లరసం పెస్టిసైడ్స్, ఫంగిసైడ్స్ వేసి, రసాయనిక ఎరువులు వాడి పండించిన పళ్లనుంచి తయారు చేసినదైతే... పళ్లరసం తీసుకున్న వెంటనే విష పదార్థాలు నేరుగా మన శరీరంలో కలిసిపోతాయి. దానివల్ల అప్పటికప్పుడు ఆరోగ్యం పాడు కావడంతో పాటు... భవిష్యత్తులో క్యాన్సర్ వంటి ప్రమాదకర జబ్బుల బారిన పడే అవకాశం ఉంది.

మరి ఏవి సహజ పద్ధతుల్లో పండించినవి? ఏవి పురుగు మందులు, రసాయనిక ఎరువులు వేసి పండించినవి? ఏవి జన్యుమార్పిడి ద్వారా పండించినవి?... అని తెలుసుకోవాలంటే పళ్ళు, కాయగూరలపై వేసే లేబుల్స్‌ను జాగ్రత్తగా గమనించాలి.




- ఆపిల్‌కున్న లేబుల్‌పై నాలుగు అంకెలు ఉండి, మొదటి అంకె మూడు లేదా నాలుగు ఉంటే రసాయనిక ఎరువులు, పురుగు మందులు వాడి పండించిన పంట.




- లేబుల్‌పై అయిదు అంకెలు ఉండి... మొదటి అంకె ఎనిమిది అయితే జన్యుమార్పిడి ద్వారా పండించిన పంట.




- లేబుల్‌పై అయిదు అంకెలు ఉండి... మొదటి అంకె తొమ్మిది ఉన్నట్లయితే అది ఆర్గానిక్ పంట.

ఇక పళ్లపై లేబుల్‌ని పిల్లలు చూసుకోకుండా తినేస్తే గాభరా పడాల్సిన అవసరం లేదు. ఆ లేబుల్ కాగితాన్ని తినదగిన పేపర్‌తోనే తయారు చేస్తారు. అంతేకాదు.. ఆ లేబుల్‌ని అతికించడానికి ఉపయోగించే జిగురు సైతం తేలిగ్గా జీర్ణమయ్యే ఆహార పదార్థాలతోనే తయారవుతుంది.

ఈసారి సూపర్‌మార్కెట్‌లో పళ్లను, కాయగూరలను కొనేటప్పుడు ఈ విషయాలు గుర్తు పెట్టుకోండి! ■

‘అమ్మో బొమ్మ’ సినిమాను చూసినవాళ్లెవరైనా ‘నా పేరు గంగారం ఓం ఫట్ స్వాహా..’ అని వెటకారంగా నవ్వుతూ రాజేంద్రప్రసాద్‌ను ముప్పుతిప్పలు పెట్టడంతో పాటు ప్రేక్షకులను కూడా భయపెట్టే బొమ్మను మరిచిపోలేరు. ఆ సినిమాలో బొమ్మది విలన్ పాత్ర కాబట్టి గంగారం అని పేరు పెట్టారు. బయట దానికి ఒకటి కాదు మూడు పేర్లు ఉన్నాయి. అవి అర్ధవత్‌రావ్ అలియాస్ గప్పీదాస్ అలియాస్ మిస్టర్ క్రేజీ. ఈ మాటకారి బొమ్మకు ఇప్పుడు వందేళ్లు. బొమ్మకు నూరేళ్లు నిండడమేంటా? అని అనుకుంటున్నారా.. ఆ విశేషాలు చెప్పడం కోసమే ఈ కథనం.





# మాటకారి బొమ్మకు వందేళ్లు!

వెంట్రిలాక్విజం... నోరు కదపకుండా మాట్లాడుతూ చేతిలో ఉన్న బొమ్మ మాట్లాడుతున్నట్టు భ్రమ కలిగించే కళ అది. వినడానికి చాలా సులువుగానే అనిపిస్తున్నా పెదాలు కదపకుండా ‘డమ్మీ’ బొమ్మ మాటల ద్వారా వినోదం పంచాలంటే సాధారణ విషయం కాదు. మ్యాజిక్‌తో సమానమైన కళ. తెలుగులో దీన్ని ‘శబ్ద భ్రమరం’ అని పిలుస్తున్నారు కాని ఎవరికీ పరిచయమైన పేరు కాదు. వెంట్రిలాక్విజం ఎప్పుడు పుట్టిందో కాని అది మన దేశంలో అడుగుపెట్టి వందేళ్లయింది. దీన్ని మొట్టమొదటి సారి భారతదేశంలో ప్రదర్శించిన వ్యక్తి వై.కె. పద్యే. ఇతడు మొదట్లో చిన్న చిన్న ఫంక్షన్లు, పార్టీలలో మ్యాజిక్ షోలు చేసేవాడు. ఒక మెజీషియన్‌గా ఎంతో పేరు కూడా సంపాదించుకున్నాడు. తన మ్యాజిక్‌కు కావల్సిన వస్తువులను ఇంగ్లాండ్ నుంచి తెచ్చుకునేవాడు. అలా అనుకోకుండా ఒకసారి ఒక బ్రిటిష సైనికుడు బొమ్మతో మాట్లాడిస్తూ తన తోటి సైనికులను ఆటపట్టిస్తుండడం చూశాడు. ఆ సైనికుడిని అడిగి అప్పుడప్పుడే ఇంగ్లాండ్‌లో పాపులర్ అవుతున్న ‘వెంట్రిలాక్విజం’ గురించి తెలుసుకున్నాడు. ఆ విద్యను నేర్చుకోవాలనే కోరికతో అమెరికా నుంచి వెంట్రిలాక్విజం మీద ఒక బుక్‌ను తెప్పించుకున్నాడు. అది చదివి సొంతంగానే ‘వెంట్రిలాక్విజం’ నేర్చుకున్నాడు. 1916 సంవత్సరంలో మొదటిసారిగా ఆయన భారతదేశంలో ‘వెంట్రిలాక్విజం’ షో నిర్వహించారు. ఈ కార్యక్రమానికి వచ్చినవారు మాట్లాడే బొమ్మను, అది చేసే అల్లరిని చూసి ఆశ్చర్యపోయారు. ఆయనపై ప్రశంసల జల్లు కురిపించారు. అప్పుడే ఆ డమ్మీ బొమ్మకు ‘అర్ధవత్‌రావ్’ అని పేరు పెట్టాడు. వెంట్రిలాక్విజంతో దేశవ్యాప్తంగా ఎంతో పేరుప్రతిష్టలు సంపాదించారు పద్యే.



కుమారుడు సత్యజిత్‌తో రామదాస్ పద్యే

రాజేంద్రకుమార్ హీరోగా నటించిన ‘అకేలీ మత్ జాయియే’ సినిమాలో పద్యే డమ్మీ బొమ్మ ‘అర్ధవత్‌రావ్’ కూడా ఒక పాత్ర పోషించింది. దీనికి వాయిస్ ఇచ్చిందీ, ముఖాన్ని మాటలకు తగ్గట్టుగా కదిలించిందీ పద్యేనే కావడం విశేషం. ఆయన తదనంతరం ఆయన కుమారుడు రామదాస్ పద్యే వెంట్రిలాక్విజాన్ని అత్యున్నత స్థాయికి తీసుకెళ్లారు. ఆయన కోడలు అపర్ణ, మనవళ్లు సత్యజిత్, పరీక్షిత్‌లు కూడా వారసత్వంగా వెంట్రిలాక్విజాన్ని కొనసాగిస్తున్నారు.

“మా నాన్న ఒక మాస్క్ వేసుకొని ప్రతిరోజూ అద్దం ముందు నిల్చొని మాట్లాడుతూ ప్రాక్టీస్ చేసేవారు. ఇంగ్లాండ్ నుంచి వచ్చిన బొమ్మకు భారతీయత ఉట్టిపడేలా వస్త్రాలను కుట్టేందుకు ఎన్నో రోజులు శ్రమించారు. దానికి విగ్‌ను కూడా ఆయనే తయారుచేశారు. బొమ్మను చూసినప్పుడు మనవాడని భారతీయులు భావించాలని ఆయన అనుకునేవారు. వెంట్రిలాక్విజాన్ని పరిచయం చేసే ముందు ఆయన దాని గురించి ఎంతో అధ్యయనం చేశారు. బొమ్మ పెదాలు ఎలా కదిపితే జనం చూపు మన వైపు రాకుండా చేయవచ్చో ఆయన్ని చూసే నేర్చుకున్నాను. మన దేశంలో దీనికి ఇవ్వాల్సినంత గౌరవం ఇవ్వడం లేదు. మిమిక్రీ, మ్యాజిక్ రెండూ కలిపి చేసే వెంట్రిలాక్విజం రావాలంటే చాలా సాధన అవసరం” అని చెప్పారు రామదాస్ పద్యే.

23 ఏళ్ల వయస్సులో రామదాస్ భారత మాజీ ప్రధాని ఇందిరా గాంధీ ముందు వెంట్రిలాక్విజం షో చేశారు. “నేను మొదటి షో ఇచ్చిన వారం రోజులకు మా నాన్న చనిపోయారు. అప్పటినుంచి ఆయన స్థానాన్ని నేనే తీసుకున్నాను” అని చెప్పారు రామదాస్ పద్యే. ఆయన ‘వీపప్పెట్స్.కామ్’ (vpuppets.com ) అనే ఒక వెబ్‌సైట్‌ను కూడా ఏర్పాటుచేశారు. భారతదేశంలో ఇదే మొట్టమొదటి వెంట్రిలాక్విజం వెబ్‌సైట్ కావడం విశేషం. వై.కె. పద్యే ఒక్క సినిమాలోనే తన వెంట్రిలాక్విజాన్ని ప్రదర్శిస్తే ఆయన తనయుడు రామదాస్ పద్యే చాలా సినిమాల్లో తన కళను చూపించారు. అమితాబ్ హీరోగా నటించిన ‘మహాన్’, జిమ్మీ షేర్‌గిల్, ప్రీతిజింటా జంటగా నటించిన ‘దిల్ హై తుమ్హారా’, మరాఠీ హారర్ చిత్రం ‘జపట్‌లేలా’, తెలుగులో ‘అమ్మో బొమ్మ’ చిత్రాలలో కనిపించే బొమ్మలు, వాటి ద్వారా వినిపించే స్వరం రామదాస్ పద్యేదే. (‘జపట్‌లేలా’ చిత్రాన్నే తెలుగులో ‘అమ్మో బొమ్మ’గా రీమేక్ చేశారు). అంతేకాకుండా రామ్‌గోపాల్‌వర్మ ‘ఫూంక్2’ చిత్రంలో కనిపించే బొమ్మలను కూడా ఈయనే తయారు చేశారు. కుటుంబ నియంత్రణ, చిన్న మొత్తాల పొదుపు, నిర్బంధ విద్య వంటి సామాజిక అంశాలపైన కూడా రామదాస్ పద్యే ఎన్నో ప్రదర్శనలు ఇచ్చారు. “తాత మొదలుపెట్టిన వెంట్రిలాక్విజాన్ని, నాన్న మరింత పైస్థాయికి తీసుకెళ్లారు.

నేను షోలు చేసే సమయానికి వెంట్రిలాక్విజం ఒక బ్రాండ్‌గా తయారయ్యింది. ఇప్పుడు వెంట్రిలాక్విజం షోలకు జనం రావట్లేదు, అందుకే యూట్యూబ్, సోషల్ మీడియా ద్వారా జనం దగ్గరికే ఈ కళను తీసుకెళ్తున్నాను” అని చెప్పారు పద్యే కుమారుడు సత్యజిత్. ఈయన ఇప్పటికే ఎన్నో సీరియల్స్, యాడ్స్‌లో తన కళను ప్రదర్శించాడు. ■

## కొత్త పుస్తకాలు

**ఖ**లీల్ జిబ్రాన్ తెలుగు పాఠకులకి సుపరిచితుడే. గతంలోనూ ఆయన రచనలకి అనువాదాలు వచ్చాయి. ఇప్పుడు మరో రెండు... ప్రపంచ ప్రసిద్ధిగాంచిన 'ది ప్రాఫెట్'ని జతిన్‌కుమార్, 'ది స్యాండ్ అండ్ ఫోమ్'ని మామిడి హరికృష్ణ, అయినంపూడి శ్రీలక్ష్మి అనువాదం చేశారు. సరళమైన అనువాదం.




# తేనెలాంటి కవిత్వం

జిబ్రాన్ రచనలని ఎందుకు చదవాలంటే మన చాలా ప్రశ్నలకి ఆయన సమాధానం చెబుతాడు. మనకి సమాధానం తెలుసుననుకున్నవాటిని ప్రశ్నిస్తాడు. ఆయనది వేదాంతమూ కాదు, సిద్ధాంతమూ కాదు, అదో మార్మిక కళ, అస్పష్ట కవిత్వం, అంతులేని అన్వేషణ. ప్రేమ ప్రేమని తప్ప ఇంకేదీ ఇవ్వదు అంటూనే అదే గాయమంటాడు. కాలము, ప్రేమ రెండూ ఒకటే అంటాడు. పసితనంలోనే హింసని, నిరాశని, విషాదాన్ని చూసిన జిబ్రాన్, మాతృదేశమైన లెబనాన్‌ని వదిలి అమెరికాలో స్థిరపడ్డాడు. కానీ ఆయన ఆత్మ సొంత గడ్డమీదే తారాడింది.

ఒక రకంగా ఇది కవిత్వం కాదు, కన్నీటి జలధార, వానొచ్చినపుడు పురివిప్పే ఇంద్రధనుస్సు. మృత్యువు కోసం అన్వేషించే యాత్ర, చేయిజారిన జీవనపాత్ర. వెదురు గాయపడి వేణువైతేనే సంగీతం. అడవిలోని చెట్టు దేహంగా మారితేనే వీణ. గొప్ప నావికులు కూడా ఆవలి ఒడ్డుని గుర్తించలేరు. అర్థం కాని వాళ్ళకి ఏదీ అర్థం కాదు. అర్థం చేసుకునే వాడికి ఒక జీవితకాలం సరిపోదు.

'ఆకాశంపై భూమి రాసే కవితలే చెట్లు /మనమేమో ఆ చెట్లని నరికేసి కాగితాలుగా మార్చేస్తున్నాం. అవి మాత్రం మనలోని డొల్లతనాన్ని నమోదు చేస్తూ ఉంటాయి' ; 'ఓ గాయకుడు విశ్వమంతా నిండివున్న లయాత్మకతను గురించి/ నీకు పాడి విని పించగలడు/ కానీ ఆ లయను పట్టుకునే చెవిని నీకివ్వలేడు/ దాన్ని ప్రతిధ్వనించే స్వరమూ ఇవ్వలేడు' ; 'కాయలోని గింజ పగిలిపోక తప్పనట్లే / విత్తులోని గుండె సూర్యరశ్మిలో తడవక తప్పనట్టే .. నీవు కూడా బాధ అనుభవించక తప్పదు' ... ఇలా జీవితసారాన్ని తేనెలా పిండి మన కందించాడు జిబ్రాన్. ఆ తేనెను ఒకేసారి తాగకుండా చుక్కచుక్కగా చప్పరిస్తే జీవితం మరింత పారదర్శకంగా కనిపిస్తుంది. పుస్తకాల్ని అందంగా ముద్రించిన ప్రచురణకర్తలకు అభినందనలు.

**- జి.ఆర్. మహర్షి**

**'ప్రవక్త', అనువాదం :** ఎస్. జతిన్ కుమార్
**పేజీలు :** 91, **వెల :** రూ.100, **ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు
**'ఇసుకను మోసుకొచ్చిన తీరం... నురగను మోసుకొచ్చిన కెరటం',**
**అనువాదం :** మామిడి హరికృష్ణ, అయినంపూడి శ్రీలక్ష్మి
**పేజీలు :** 60, **వెల :** రూ.100, **ప్రతులకు :** 99633 74567

---

# నవ్వుల 'గీత'లు

**చూ**డగానే నవ్వు పుట్టించడం కార్టూనుకు ఉండాల్సిన ప్రథమ లక్షణం. అది పిసరంత ఎక్కువే ఉన్న కార్టూన్ పుస్తకం ఇది.

వృత్తి రీత్యా లాయర్ అయినప్పటికీ ప్రవృత్తి, ఆసక్తి అంతా కార్టూన్లపైనే అని స్వయంగా చెప్పుకొనే వ్యక్తి బాచి. ఆపై నటుడు. అతివ వేషంలోనూ రంజింపజేసే సామర్థ్యం ఉన్న వ్యక్తి. 'బాబాయిగారూ ఇంట్లో మందు నిండుకుంది, ఓ పెగ్గుడు మందిస్తారూ, రేపిచ్చేస్తా' అన్న క్యాప్షన్‌తో మందంటే పడని వారిని కూడా నవ్వించగలిగే సత్తా ఉంది. కవలపిల్లలం గనుక ఒక పాస్‌పోర్ట్ ఫోటో చాలని చెప్పగల ఘటికుడు ఈ కార్టూనిస్టు. దేవుడు ప్రత్యక్షమైతే, నేను తపస్సు చేస్తున్నదే రంభ కోసమని భక్తుడితో అనిపించేస్తాడు. చూడముచ్చటి గీతకు తోడు చక్కని క్యాప్షన్ ఈయన సొంతం అంటే అతిశయోక్తి కాదు. తనకు తోడు మరింత మంది కార్టూనిస్టులను ఆదరించేందుకు 'సిరిమల్లి పువ్వల్లే నవ్వు' అంటూ ఏకంగా ఫేస్‌బుక్ గ్రూపుని నిర్వహిస్తుండటం విశేషం. అమ్మ మరణానంతరం ఆమె ముద్దు పేరు బాచితో కార్టూన్లు గీస్తున్న




ఈయన సొంత పేరు అన్నం శ్రీధర్. ఆయన కుంచె తడి ఎప్పటికీ ఆరకూడదని ఆశీర్వదించే ముందు ఈ పుస్తకం చూసి మనసారా నవ్వుకోండి.

**- మద్దిపట్ల మణి**

**బాచి కార్టూన్లు**, అన్నం శ్రీధర్ బాచి
**పేజీలు:** 160, **వెల :** రూ.150
**ప్రతులకు:** బాచి, హైదరాబాద్,
ఫోన్ నెం.040-24042847

## ఇవీ వచ్చాయి

**కశ్యప యోధుడు** (నవల)
**రచన :** డా. జూకూరి
**పేజీలు :** 260, **వెల :** రూ.200

**పింజారి** (షేక్ నాజర్ ఆత్మకథ)
**సేకర్త :** ఎ. వెంకటరమణమూర్తి
**పేజీలు :** 87, **వెల :** రూ.65

**ఇన్‌ఫెక్షన్స్**
**రచన :** డా. కె. ఉమాదేవి
**పేజీలు :** 156, **వెల :** రూ.140
**ప్రతులకు :** విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

---

**కొత్త చరిత్ర**
(తెలంగాణ రాష్ట్రం - అస్తిత్వ చైతన్యం)
**రచన :** బి.ఎస్. రాములు
**పేజీలు :** 304, **వెల :** రూ.200

**తెలంగాణ దారిదీపాలు**
**ఒద్దిరాజు సోదరులు**
**రచన :** బి. రామరాజు
**పేజీలు :** 54, **వెల :** రూ.40

**కథలు రాయడమెలా?**
**రచన :** శొంఠి కృష్ణమూర్తి
**పేజీలు :** 88, **వెల :** రూ.60

**నక్షత్ర వైభవం**
**రచన :** జమ్మి కోనేటిరావు
**పేజీలు :** 78, **వెల :** రూ.60

**ఆధునికతకు చిరునామా సైన్స్**
**రచన:** డాక్టర్ నాగసూరి వేణుగోపాల్
**పేజీలు :** 134, **వెల :** రూ.100
**ప్రతులకు :** నవచేతన పబ్లిషింగ్ హౌస్

---

**బడి (ఎలా ఉంది? ఏం చేయాలి? ఎలా చెయ్యాలి? ఎవరు చెయ్యాలి?)**
**రచన :** శాంతివనం మంచికంటి
**పేజీలు :** 72, **వెల :** రూ.35
**ప్రతులకు :** 94907 46614

---

**తెలుగమ్మ ఒడిలో బౌద్ధం**
**రచన :** బొర్రా గోవర్ధన్
**పేజీలు :** 102, **వెల :** రూ.80
**ప్రతులకు :** 98852 81545

---

**భారతంలో బంధాలు**
**రచన :** డా. కడియాల జగన్నాథశర్మ
**పేజీలు :** 208, **వెల :** రూ.150
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

---

**భృగ్వాదుల ప్రభావము**
(పద్మశాలీయుల పూర్వోత్తర చరిత్ర)
**రచన :** గుంటక నరసయ్య పంతులు
**పేజీలు :** 150, **వెల :** రూ.200
**ప్రతులకు :** 93480 09227



**సొరియాసిస్ వ్యాధి కన్నా సొరియాటిక్ ఆర్థరైటిస్ ఎక్కువ ప్రమాదకరమైనది. సొరియాసిస్‌లో ఏర్పడేవి ఒంటి మీద మచ్చలే. అవి కొద్ది రోజుల వైద్య చికిత్సలతోనే పూర్తిగా తగ్గిపోతాయి. అదే సొరియాటిక్ ఆర్థరైటిస్ పరిస్థితి వేరు. దీనివల్ల కాలి వేళ్లు, చేతి వేళ్లు వంకర్లు పోయి ఒక దశలో అంగవైకల్యమే మిగిలిపోతుంది. ఒకసారి అలా వంకర్లు పోయాక తిరిగి వాటిని సాధారణ స్థితికి తీసుకు రావడం ఎప్పుడూ సాధ్యం కాదు. అందుకే సమస్య సొరియాటిక్ ఆర్థరైటిస్‌గా మారే దాకా నిర్లక్ష్యంగా ఉండిపోకుండా సొరియాసిస్ వైద్య చికిత్సలు తీసుకుంటే సొరియాసిస్ ఆర్థరైటిస్ వచ్చే అవకాశమే ఉండదంటున్నారు, ఆయుర్వేద వైద్య నిపుణులు డాక్టర్ పూజారి రవి కుమార్.**

# సొరియాటిక్ ఆర్థరైటిస్ నుంచి సంపూర్ణ విముక్తి

ఆమె వయసు 35. దాదాపు పదేళ్లుగా ఆమెకు సొరియాసిస్ ఉంది. అయితే గత నాలుగేళ్లుగా సొరియాటిక్ ఆర్థరైటిస్ కూడా బాధిస్తోంది. తొలుత తలనుంచి మొదలైన సొరియాసిస్ రెండేళ్లలో మొత్తం శరీరమంతా పాకింది. ఆ తర్వాత రెండేళ్లలో చిన్న కీళ్లల్లో నొప్పి మొదలయ్యింది. నొప్పితో పాటు ఉదయం వేళల్లో కీళ్లు బిగుసుకుపోవడం కీళ్లల్లో వాపు కనిపించాయి. అరిచేతుల కీళ్లు, అరికాళ్ల కీళ్లల్లో, మడమల్లో కూడా వాపు తలెత్తింది. దీనివల్ల నడవడం కూడా సమస్య అయిపోయింది. సకాలంలో వైద్యం అందకపోవడంతో కాలివేళ్లు, చేతివేళ్లు వంకర్లు పోయే పరిస్థితి కూడా ఏర్పడింది. ఇతర వైద్య విధానాల్లో చాలా కాలమే చికిత్సలు తీసుకున్నా ఫలితమేమీ రాకపోవడంతో ఎవరో చెప్పగా విని మా వద్దకు వచ్చారు. మా వద్దకు రాగానే ముందుగా ఆమెకు విరేచన చికిత్స చేసి ఆ తర్వాత వైతరణ వస్తి చికిత్స చేశాం. ఈ చికిత్సను వరుసగా వరుసగా 20రోజులపాటు ఇచ్చాం. దీనితో ఉదయం వేళల్లో కీళ్లు బిగుసుకుపోవడం, కీళ్ల వాపు, నొప్పి తగ్గిపోయాయి. ఎన్ని వైద్య చికిత్సలు చేసినా ఒకసారివేళ్లు వంకర్లు పోతే అవి మళ్లీ చక్కబడవు. కానీ, కీళ్లలోని వాపు, నొప్పి తగ్గిపోతే ఆ వంకర్ల వల్ల అంత పెద్ద సమస్యేమీ ఉండదు. కాకపోతే వైద్య చికిత్సల వల్ల మునుముందు ఆ వేళ్లు మరింతగా వంకర్లు పోయే ప్రమాదం మాత్రం తప్పుతుంది. ఆమెకు చేసిన వైతరణ వస్తి, పంచకర్మ చికిత్సల వల్ల సొరియాటిక్ ఆర్థరైటిస్ సమస్య పూర్తిగా త గ్గిపోయింది. అసలే కాలు కదపలేని స్థితిని దాటి ఇప్పుడామె తన పనులన్నీ తానే చేసుకోగలుగుతోంది. చికిత్స ప్రారంభమైన కొద్ది రోజుల్లోనే ఆమె శరీరం మీదున్న మచ్చలన్నీ పూర్తిగా మాయమైపోయాయి.

> **వైతరణ వస్తి, పంచకర్మ చికిత్సల వల్ల సొరియాటిక్ ఆర్థరైటిస్ సమస్య పూర్తిగా తగ్గిపోయింది. అసలే కాలు కదపలేని స్థితిని దాటి ఇప్పుడామె తన పనులన్నీ తానే చేసుకోగలుగుతోంది. చికిత్స ప్రారంభమైన కొద్ది రోజుల్లోనే ఆమె శరీరం మీదున్న మచ్చలన్నీ పూర్తిగా మాయమైపోయాయి.**

## ఆర్థరైటిస్ ఎప్పుడైనా రావచ్చు

సొరియాసిస్ శరీరమంతా వ్యాపించిన తర్వాతే సొరియాటిక్ ఆర్థరైటిస్ వస్తుందని కూడా కాదు. కొందరికి ఒంటి మీద సొరియాసిస్ మచ్చలేవీ కనిపించకుండానే సొరియాటిక్ ఆర్థరైటిస్ రావచ్చు. కేవలం తల మీదే సొరియాసిస్ కనిపించినా, ఆ తర్వాత ఒకటి రెండు మాసాల్లోనే సొరియాటిక్ ఆర్థరైటిస్ మొదలు కావచ్చు. శరీరం మీద చాలా స్వల్పంగానే మచ్చలు కనిపించినా ఆ తర్వాత కేవలం ఆరు నుంచి 12 మాసాల్లోనే సొరియాటిక్ ఆర్థరైటిస్‌గా బయటపడవచ్చు.మౌలికంగా సొరియాటిక్ ఆర్థరైటిస్ అనేది వాత ప్రకోపం వల్ల తలెత్తే సమస్య కాబట్టి, దానికి వస్తి ప్రధాన చికిత్సే అయినా అంతకుముందే వమన కర్మతో కఫాన్ని నియంత్రించాలి. విరేచన కర్మద్వారా పిత్తాన్ని నియింత్రించాలి. పిత్తాన్ని నియంత్రించే క్రమంలో సహజంగానే వాతహరణం కూడా జరుగుతుంది. ఆ తర్వాత వస్తి క ర్మ చేస్తే దాని వల్ల పరిపూర్ణ ఫలితాలు వస్తాయి. వమన కర్మ చేసినప్పుడు కఫం కారణంగా వచ్చే వాపు, దురద కూడా తగ్గుతాయి. విరేచన కర్మ వల్ల మంట, నొప్పి తగ్గుతాయి. వస్తి చికిత్స వల్ల నొప్పి కూడా పూర్తిగా తగ్గుతాయి. వైద్య చికిత్సల వల్ల అప్పటికే వంకర్లు పోయిన వేళ్లను చక్కబరచలేం కానీ, మునుముందు ఆ పరిస్థితి మరింత తీవ్రం కాకుండా మాత్రం కచ్చితంగా ఆపవచ్చు. కొన్ని కారణాల వల్ల కొందరిలో సొరియాసిస్ తిరిగి రావచ్చేమో గానీ, సొరియాటిక్ ఆర్థరైటిస్ మాత్రం ఈ వైద్య చికిత్సల తర్వాత 95 శాతం మందిలో మళ్లీ రాదు. ఆ 5 శాతం మందిలోనైనా తిరిగి రావడానికి హఠాత్తుగా మారిన వాతావరణ పరిస్థితులే కారణంగా ఉంటాయి. లేదా సముద్రపు చేపల్ని అతిగా తీసుకోవడం కూడా ఇందుకు కారణం కావచ్చు. ఆ కొద్ది మందిలో సొరియాసిస్ తిరిగి రావడానికైనా అనుసరించాల్సిన విధానాల పట్ల రోగి చూపే నిర్లక్ష్యమే కారణంగా ఉంటుంది తప్ప వైద్య చికిత్సల్లో లోపం ఉండదు..

## థైరాయిడ్, మధుమేహాలకూ బ్రేక్

సొరియాటిక్ ఆర్థరైటిస్ సమస్య ఆ ఐదు శాతం మందిలోనైనా రాకుండా ఉండడానికి ఏడాదికి రెండు మూడు సార్లు విరేచన కర్మ చేయించుకుంటే ఆ సమస్య కూడా ఉండదు. అలాగే సొరియాసిస్ శరీర అంతర్భాగాల్లోకి వెళ్లినప్పుడు తలెత్తే లివర్, కిడ్నీ, గుండె, మెదడు సమస్యలు రాకుండా ముందే నియంత్రించినట్లు అవుతుంది. సొరియాటిక్ ఆర్థరైటిస్ వచ్చిన వారిలో ఆ తర్వాత థైరాయిడ్ సమస్యలు ఎక్కువగా కనిపిస్తున్నాయి. అలా మధుమేహ లక్షణాలు (ప్రి-డయాబెటిక్) కూడా ఎక్కువ మందిలోనే కనిపిస్తున్నాయి. అందువల్ల ముందే వైతరణ వస్తి చికిత్సలు తీసుకోవడం వల్ల సొరియాటిక్ ఆర్థరైటిస్‌ను మాత్రమే కాకుండా, దాని మూలంగా వచ్చే థైరాయిడ్, మధుమేహ మూలాల్ని కూడా ముందే అరికట్టే అవకాశాలు సంపూర్ణంగా ఉంటాయి.


**ఆర్ కె ఆయుర్వేద వైద్యబృందం**
ఆర్ కె ఆయుర్వేదిక్ అండ్ సొరియాసిస్ సెంటర్
క్లినిక్స్: హైదరాబాద్,విజయవాడ, వైజాగ్, హన్మకొండ,కర్నూలు, తిరుపతి
ఫోన్స్: 98492 54587, 040-23057483
8886922245

# గోంగూర స్పెషల్స్

ఫుడ్ కోర్ట్

**డైనింగ్ టేబుల్ మీద ఎన్ని రకాల వంటలున్నా 'గోంగూర' స్థానం మాత్రం ప్రత్యేకం. తెలంగాణలో 'పుంటికూర'గా పిలిచే ఈ ఆకుకూర అచ్చతెలుగు వంటకంగా కీర్తించబడింది. అటువంటి గోంగూరతో కొన్ని స్పెషల్ వంటకాలు మీకోసం...**



## గోంగూర పనీర్ కర్రీ

**కావలసిన పదార్థాలు:** గోంగూర- ఒక కట్ట, పనీర్- 100 గ్రా., నూనె- రెండు టేబుల్ స్పూన్లు, తరిగిన ఉల్లిపాయలు- రెండు, అల్లంవెల్లుల్లి ముద్ద- ఒక టేబుల్ స్పూను, పచ్చిమిర్చి- ఆరు, జీలకర్ర- ఒక టీ స్పూను, కారం- ఒక టీ స్పూను, పసుపు- అర టీ స్పూను, ధనియాల పొడి- రెండు టీ స్పూన్లు, కరివేపాకు- కొద్దిగా, గరం మసాలా- అర టీ స్పూను, ఉప్పు- తగినంత.

**తయారీ విధానం:** బాణలిలో ఒక టేబుల్ స్పూన్ నూనె వేసి పనీర్ ముక్కలను వేగించి పక్కన పెట్టుకోవాలి. తర్వాత అదే బాణలిలో అల్లంవెల్లుల్లి, ఉల్లిపాయలు, పచ్చిమిర్చి, కొద్దిగా ఉప్పు వేసి రెండు నిమిషాలు వేగించాలి. తర్వాత గోంగూర వేసి చిన్నమంట మీద మూతపెట్టి ఉడికించి మెత్తగా రుబ్బుకోవాలి. ఆ తర్వాత బాణలిలో మిగిలిన నూనె వేసి వేడెక్కాక జీలకర్ర, కరివేపాకు, పసుపు వేసి వేగించాలి. తర్వాత గోంగూర, కారం, ధనియాల పొడి, గరంమసాలా, ఉప్పు వేసి కొద్దిగా నీళ్లు పోసి రెండు నిమిషాలు ఉడికించాలి. చివరగా పనీర్ ముక్కలను వేసి బాగా కలిపి నిమిషం పాటు ఉడికించి దింపేయాలి.



## గోంగూర బిర్యానీ

**కావలసిన పదార్థాలు:** బాస్మతి బియ్యం- ఒకటిన్నర కప్పు, గోంగూర- రెండు కప్పులు, అల్లంవెల్లుల్లి ముద్ద- ఒక టీ స్పూను, తరిగిన ఉల్లిపాయ- ఒకటి, తరిగిన పచ్చిమిర్చి- ఆరు, కొత్తిమీర- రెండు టేబుల్ స్పూన్లు, జీడిపప్పు- ఆరు, బిర్యానీ ఆకు- ఒకటి, లవంగాలు- నాలుగు, దాల్చిన చెక్క- చిన్న ముక్క, యాలకులు- ఒకటి, నెయ్యి- ఒక టేబుల్ స్పూను, నూనె- ఒక టేబుల్ స్పూను, ఉప్పు- తగినంత.

**తయారీ విధానం:** బాణలిలో నూనె పోసి గోంగూరను ఉడికించి, మెత్తగా రుబ్బి పక్కనపెట్టుకోవాలి. తర్వాత కుక్కర్‌లో నెయ్యి వేసి వేడెక్కాక జీడిపప్పు, బిర్యానీ ఆకు, లవంగాలు, దాల్చిన చెక్క, యాలకులు వేసి వేగించాలి. తర్వాత ఉల్లిపాయలు, పచ్చిమిర్చి, కొత్తిమీర, ఉప్పు వేసి మరో నిమిషం సేపు వేగించాలి. తర్వాత అల్లంవెల్లుల్లి ముద్ద వేసి మంచి వాసన వచ్చేదాకా వేగించాలి. ఆ తర్వాత గోంగూర కూడా వేసి బాగా కలిపిన తర్వాత బాస్మతి బియ్యం వేసి తగినన్ని నీళ్లు పోసి మూడు విజిల్స్ వచ్చేదాకా ఉడికించాలి.



## గోంగూర మటన్

**కావలసిన పదార్థాలు:** మటన్- అర కిలో, గోంగూర- 3 కట్టలు, తరిగిన పచ్చిమిర్చి- 6, పసుపు- ఒక టీ స్పూను, అల్లంవెల్లుల్లి ముద్ద- ఒక టేబుల్ స్పూను, గరం మసాలా- ఒక టీ స్పూను, తరిగిన ఉల్లిపాయ- ఒకటి, నూనె- ఒక టేబుల్ స్పూను, కారం- 2 టీ స్పూన్లు, ధనియాల పొడి- ఒక టీ స్పూను, జీలకర్ర పొడి- అర టీ స్పూను, ఉప్పు- తగినంత.

**తయారీ విధానం:** కుక్కర్‌లో మటన్, జీలకర్ర పొడి, ధనియాల పొడి, కారం, కొద్దిగా ఉప్పు వేసి కొన్ని నీళ్లు పోసి నాలుగు విజిల్స్ వచ్చేదాకా ఉడికించాలి. తర్వాత బాణలిలో నూనె పోసి వేడెక్కాక ఉల్లిపాయలు, గరం మసాలా వేసి ఒక నిమిషం సేపు వేగించాలి. తర్వాత అల్లంవెల్లుల్లి ముద్ద, పసుపు, పచ్చిమిర్చి, గోంగూర వేసి బాగా కలిపి చిన్న మంట మీద ఉడికించాలి. ఆ తర్వాత ఉడికిన మటన్, తగినంత ఉప్పు వేసి కలిపి పది నిమిషాలు ఉడికించి దించేయాలి.



## గోంగూర పులిహోర

**కావలసిన పదార్థాలు:** బియ్యం- 2 కప్పులు, గోంగూర- 2 కట్టలు, పసుపు- అర టీస్పూన్, కరివేపాకు- కొద్దిగా, ఆవాలు- ఒక టీస్పూను, మెంతులు- అర టీస్పూను, ఎండు మిర్చి- 4, ఉప్పు- తగినంత.

**పోపు కోసం:** శనగపప్పు- 1 టేబుల్‌స్పూను, మినప్పప్పు- 1 టేబుల్ స్పూను, ఆవాలు, జీలకర్ర- అర టీస్పూను, ఎండుమిర్చి- 2, తరిగిన పచ్చిమిర్చి- 4, పల్లీలపొడి- 2 టీస్పూన్లు, నూనె- 3 టేబుల్ స్పూన్లు.

**తయారీ విధానం:** అన్నం వండి చల్లార్చి చిటికెడు పసుపు, ఒక టేబుల్ స్పూను నూనె, కొద్దిగా ఉప్పు, కొన్ని గోంగూర ఆకులు వేసి కలిపి పక్కన పెట్టుకోవాలి. తర్వాత కొంచెం నూనెలో గోంగూరను చిన్న మంట మీద ఉడికించి పక్కన పెట్టుకోవాలి. ఒక బాణలిలో ఒక టేబుల్ స్పూను నూనె పోసి వేడెక్కాక ఆవాలు, మెంతులు, ఎండు మిర్చి వేసి వేగించి మిక్సీలో మెత్తగా రుబ్బాలి. తర్వాత గోంగూరను కూడా వేసి ఒక తిప్పు తిప్పాలి. తాలింపు వేసి ఆ గిన్నెలోనే అన్నం, గోంగూర పేస్టు వేసి బాగా కలపాలి. చివరగా పల్లీల పొడి, తగినంత ఉప్పు వేసి కలిపి దించేయాలి.

# పీసీఓడీ సమస్యకు హోలిస్టిక్ చికిత్స




**డాక్టర్ గోరంట్ల చంద్రశేఖరరావు**
ఎం.డి, పీహెచ్‌డీ (హోమియో)
**డి.ఎస్‌సి. హోమియో (అమెరికా)**
**మేనేజింగ్ డైరెక్టర్, హోమియో ట్రెండ్స్**
**హైదరాబాద్, సికింద్రాబాద్, విజయవాడ, వైజాగ్**
**ఫోన్స్: 77 3000 3000, 77 3000 4000**


**స్త్రీలలో** యుక్తవయస్సురాగానే రుతుక్రమం మొదలవుతుంది. ఈ రుతుక్రమం నెలకొకసారి క్రమపద్ధతిలో రావడం అనేది స్త్రీల ఆరోగ్య వంతమైన జీవితానికి ఒక సూచికలాంటిది. ఈ నవీనయుగంలో యుక్తవయస్సు, మధ్యవయస్సులో వచ్చే సర్వసాధారణ సమస్య పీసీఓడీ. దీనిని సాధారణ భాషలో నీటి బుడగలు అంటారు.

### ఎందుకు వస్తుంది?

1. వంశపారంపర్యంగా వస్తుంది.
2. ఊబకాయం. స్త్రీలలో బరువు ఎక్కువగా ఉంటే ఈ పీసీఓడీ వచ్చే అవకాశం ఉంటుంది.
3. స్ట్రెస్, ఒత్తిడి, సరైన వ్యాయామం లేకపోవడం, ఆందోళన మొదలగు మానసిక కారణాలు కూడా పీసీఓడీ రావడానికి దోహదపడతాయి.

### పీసీఓడీలో ఏమి జరుగుతుంది?

ఆడవారిలో సరైన రుతుక్రమం కొరకు హార్మోన్ల సమతుల్యత అవసరం. పీసీఓడీ సమస్యలో హార్మోన్ల సమతుల్యత దెబ్బతినడం జరుగుతుంది. ఆడవారిలో ఆండ్రోజన్ అనే మగవారి హార్మోన్ల శాతం పెరగడం జరుగుతుంది. దీనివల్ల మొటిమలు, ముఖం, శరీరం మీద అవాంఛిత రోమాలు, నెలసరి లేటుగా రావడం, మెడచుట్టు నల్లటి దళసరితనం రావడం జరుగుతుంది.

### లక్షణాలు

1. రుతుక్రమం ఆలస్యంగా రావడం
2. శరీరం, ముఖం మీద అవాంచిత రోమాలు
3. జుట్టురాలడం, పలుచబడటం జరుగుతుంది.
4. ముఖం మీద జిడ్డు ఎక్కువగా ఉత్పత్తి కావడం వల్ల మొటిమలు వస్తుంటాయి.
5. నెలసరి ఎక్కువ రోజులుండి ఆగిపోవడానికి మందులు వాడాల్సి వస్తుంది.
6. బరువు పెరుగుతారు. తక్కువతిన్నా, వ్యాయామం చేసినా తగ్గరు.
7. మెడచుట్టూ నల్లబడటం జరుగుతుంది.
8. అండం ఎదుగుదల లోపం, అండం సరైన సమయంలో విడుదల కాకపోవడం వల్ల సంతానలేమి సమస్య ఉండటం జరుగుతుంది.

### పరీక్షలు

అల్ట్రాసౌండ్ పెల్విస్, ఎఫ్ఎస్‌హెచ్, ఎల్‌హెచ్, ఎఫ్ఎస్‌హెచ్, ప్రొలాక్టిన్, టెస్టోస్టిరాన్ రక్తపరీక్షలు చేసి నిర్ధారించవచ్చు.

### హోమియో చికిత్స

పీసీఓడీ నిర్ధారించిన తరువాత త్వరగా హోమియో వైద్యం మొదలుపెట్టాలి. పేషెంట్ యొక్క మానసిక తత్వం, శారీరక తత్వంతోపాటు ముఖ్యమైన వ్యాధి లక్షణాలను కలిపి హోలిస్టిక్ చికిత్స ద్వారా పీసీఓడీని నయం చేయవచ్చు. ఈ హోమియో వైద్యంతో ఎటువంటి దుష్ఫలితాలు లేకుండా సహజంగా హార్మోన్స్ బ్యాలెన్స్ అవుతాయి.

# సోరియాసిస్‌కు శాశ్వత చికిత్స ఉందా?

**సోరియాసిస్** అనేది దీర్ఘకాలిక చర్మ వ్యాధి. చర్మం మీద ఎర్రటి పొడలతోపాటు, తెల్లటి చేపలలాంటి పొట్టు రావడం, దురదగా ఉండటం ఈ చర్మవ్యాధి యొక్క ప్రధాన లక్షణాలు. చాలా మందిలో చలికాలంలో ఈ వ్యాధి ఎక్కువ అవుతుంది.

### రకాలు

- **స్కాల్ప్ సోరియాసిస్ :** తలలో చుండ్రులాగా ఉంది. తలకు తెల్లటి పొడలు అతుక్కుని తెల్లటి, పెచ్చులాంటి పొట్టురావడం జరుగుతుంది. దీనిని స్కాల్ప్ సోరియాసిస్ అంటారు. చాలామంది దీనిని చుండ్రులా భావించి చికిత్స తీసుకుని ఫలితం కనపడక బాధపడుతుంటారు.
- **ప్లేక్ సోరియాసిస్ :** శరీరంలో వివిధ భాగాల్లో పెద్ద పెద్ద పొడలుండి పెద్ద పొలుసులు వచ్చి విపరీతమైన దురద వస్తుంది.
- **పామోప్లాంటార్ సోరియాసిస్ :** అరికాళ్లలో, అరిచేతుల్లో కురుపులు, పొట్టుతో పాటు పగుళ్లు వచ్చి దురద రావడం, పగుళ్ల నుంచి రక్తంరావడం జరుగుతుంది.
- **ఎరిత్రోడెర్మిక్ సోరియాసిస్ :** ఒళ్లంతా ఎర్రటిపొడలు, పొట్టు వచ్చి తీవ్రమైన పొలుసులు వస్తాయి.



తమిళనాడు మాజీ గవర్నర్ శ్రీరోశయ్యగారు ఇటీవల జరిగిన కార్యక్రమంలో డా.గోరంట్ల చంద్రశేఖరరావుగారికి వైద్యరత్న అవార్డుతో సన్మానించారు. హోమియో వైద్యంలో పీహెచ్‌డీ పట్టాను సాధించిన దక్షిణ భారతదేశంలో మొదటి వైద్యుడిగా మరియు భారతదేశంలో మూడవ వైద్యుడిగా అత్యంత అరుదైన గౌరవము పొందినందుకు ఈ అవార్డు ఇవ్వడం జరిగింది.

### ఎందుకు వస్తుంది?

సాధారణంగా మన శరీరంలో చర్మంలో పాతచర్మకణాలు పోయి కొత్త చర్మకణాలు రావడానికి సుమారుగా ఇరవైఎనిమిది రోజులు పడుతుంది. సోరియాసిస్ వ్యాధిగ్రస్తుల్లో తన రక్షణ వ్యవస్థ తన చర్మం మీద కణాల మీద దాడిచేసి కొత్త చర్మకణాలను త్వరగా అంటే ఐదు నుంచి ఎనిమిది రోజుల్లో ఉత్పత్తి చేయడం వల్ల కొత్త చర్మకణాలు పాత చర్మకణాలను బయటకు నెట్టివేసి పొడల లాగా, పొట్టులాగా కనిపిస్తుంది.

### హోమియో చికిత్స

సోరియాసిస్‌ను సమూలంగా నివారణకు హోలిస్టిక్ పద్ధతి ద్వారా హోమియో వైద్యంలో చికిత్స చేయడం జరుగుతుంది. సోరియాసిస్ వ్యక్తి మానసిక స్థితి, శారీరక లక్షణాలు, ఎటువంటి సోరియాసిసో తెలుసుకుని చికిత్స చేయడం ద్వారా శాశ్వత చికిత్స సాధ్యపడుతుంది.



## పూరణం

నిర్వహణ : **గొరుసు**

### అడ్డం

1. ఈ నాయకుడి జయంతే రేపటి బాలల దినోత్సవం (2)
2. ప్రవరుడ్ని వలచినన గంధర్వ కన్య (4)
5. గుహలాంటి దారి (3)
7. తీసివేత కాదు చేరిక (3)
8. వాన ఆద్యంతాలుగా వెలయాలు (4)
10. నల్లసముద్రం సరిహద్దుగా గల ఒక యూరప్ దేశం (4)
12. 'అభిజ్ఞాన శాకుంతల' రచయిత (4)
14. తిరగబడ్డ గవ్వలు (3)
16. నిలువు 5కు ఏమాత్రం తీసిపోనిది (2)
17. మహమ్మారికి మరో పేరు (3)
19. డేరా (3)
21. అందమైన (పలువరస గల) స్త్రీ (3)
22. ఒక ప్రాంతాన్ని సూచించే టపాకాయ (2)
23. అడ్డం 36లోని చంద్రుడు కొలువుదీరిన క్షేత్రం (4)
25. వ్యక్తులకిచ్చే గౌరవ పురస్కారం (3)
27. ఘటన కాదు సంస్కృత కుండ (2)
28. ఆవిరిలోని పువ్వు (2)
30. దురద (2)
31. ఈ వ్రతం నోచినప్పుడు నోరు విప్పకూడదు (2)
32. ప్రసిద్ధి చెందిన తాపేశ్వరం తీపి వంటకం (5)
34. నేర్పు (4)
36. పుణ్యం కోసం బామ్మలు రాసుకునే కోటి (2)
37. ఇతడు కాని మహేశ్‌బాబు (3)
38. తనికెళ్ల భరణి దర్శకత్వంలో వచ్చిన చిత్రం (3)
39. శృంగారములో దాగింది పల్లకూ పడుతుంది (2)
40. " - - గారే యశోద ముంగిట ముత్యము వీడు .."(2)
41. గడచిన కాలం (2)
42. తెలుగు Fever (2)

### నిలువు

1. ఇది కూడా రక్తమే (3)
2. బూడిద గుమ్మడితో చేసుకునే 'సైడ్ డిష్' (4)
3. ధనము; ఒకనాటి వెండి బంగారు నాణేలు (2)
4. చనిపోయిన ప్రముఖులకు అభిమానులు అర్పించేది (3)
5. సౌందర్యమే ... దీనిని చూడ తరమా!' (3)
6. తల తెగిన వానరం తలకిందు లైంది (2)
7. ఈ రాగం తీయడానికి సంగీత జ్ఞానం అక్కర్లేదు! (2)
9. చలం, రోజారమణి జంటగా వచ్చిన ఒక నవలాచిత్రం 'లంబాడోళ్ల - - - ' (3)
11. నాన్న తోడబుట్టింది (3)
12. దివిటీ (3)
13. గాలివార్త (3)
15. శీర్షాసనం వేసింది గవ్వ వంటి ఒక పక్షి (2)
16. పల్లకి (3)
17. గందరగోళం (4)
18. Receipt (3)
20. చిరంజీవిని 'బావగారూ బాగున్నారా!' అని పలకరించిన హీరోయిన్ (2)
21. మంచి చరిత్ర గల స్త్రీ (4)
24. కుప్పంలో వెలసిన విశ్వవిద్యాలయం (3)
26. దారి తప్పిన చారులత (4)
27. ద్రవము కానిది (3)
29. విసనకర్ర (4)
31. అశోకుడు ఏ వంశపు రాజు? (2)
32. హోలీకి దహనమయ్యేవాడి గ్రంథనామం (4)
33. చెరసాల (4)
35. ఉత్తరాంధ్ర డోలు (3)
37. బువ్వ వంటి జేజి (2)
38. ఒక దీర్ఘం కోల్పోయిన 'సీతారామయ్యగారి మనవరాలు' (2)

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | * | 2 | 3 | | 4 | * | 5 | 6 | |
| | * | 7 | | | * | 8 | 9 | | | * |
| 10 | 11 | | | * | 12 | | | | * | 13 |
| * | | * | 14 | 15 | | * | | * | 16 | |
| 17 | | 18 | * | 19 | | 20 | * | 21 | | |
| | * | 22 | | * | * | 23 | 24 | | | * |
| 25 | 26 | | * | 27 | | * | 28 | | * | 29 |
| 30 | | * | 31 | | * | 32 | | | 33 | |
| * | 34 | 35 | | | * | | * | * | 36 | |
| 37 | | | * | * | 38 | | | * | 39 | |
| | * | 40 | | * | 41 | | * | 42 | | * |

### గత వారం జవాబులు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 త | * | 2 ఉ | 3 బ్బ | సం | * | 4 జీ | 5 వి | త | 6 మే | * |
| 7 మ | య | న్మా | ర్ | * | 8 వ | రా | హం | * | 9 ర | 10 ఫీ |
| ల | * | 11 ది | గ | * | రు | * | 12 గం | గి | * | బ్ర |
| 13 పా | 14 చి | * | * | 15 ద్రో | ణు | 16 డు | * | * | 17 ఆ | వ |
| 18 కు | ను | 19 కు | * | 20 హి | డు | తు | * | 21 దా | స | రి |
| * | 22 కు | చ్చి | 23 ళ్ళు | * | * | 24 ర | 25 వా | ణా | * | * |
| 26 శా | * | 27 తం | తే | * | 28 శో | భ | న | * | 29 కా | 30 వి |
| 31 కా | 32 జా | * | * | 33 బిం | కం | * | * | 34 సై | క | తం |
| * | బి | * | 35 అం | దె | * | 36 ఈ | శా | న్యం | * | డ |
| 37 ఆ | లీ | 38 బా | బా | * | 39 పం | గ | * | * | 40 జా | వా |
| దాం | * | 41 స | రీ | సృ | పా | లు | * | 42 ఉ | గా | ది |



## అంకెళి

నిర్వహణ : **పి. రాఘవరెడ్డి**

**అడ్డం, నిలువులోనే కాకుండా బాక్సులో, క్రాస్‌లో కూడా 1 నుండి 9 అంకెలు ఒకసారే వచ్చేలా నింపాలి. దాదాపు సుడోకు లాంటిదే. కాని రెండు క్రాస్‌లలో కూడా రావడం ఇందులో అదనం.**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 6 | | | 8 | 4 | | | | 3 |
| 4 | | | 5 | 2 | | | | 8 |
| 8 | | | | | | | | 2 |
| | 8 | 4 | | | 1 | | | |
| | 6 | 1 | | 8 | | 4 | 5 | |
| | | | 9 | | | 8 | 7 | |
| 1 | | | | | | | | 4 |
| 3 | | | | 1 | 5 | | | 7 |
| 2 | | | | 3 | 9 | | | 5 |

కొసమెరుపు











# నీడలూ.. నిజాలూ!



నీడలు నిజాల సాక్ష్యాలే.. అన్నాడో సినీ కవి. కాని ఈ బొమ్మలను చూస్తుంటే నిజానికి, నీడలకు అసలు సంబంధం లేదనిపిస్తోంది కదూ... వెర్రికి వెయ్యి తలలున్నట్లుగా ఇది కూడా ఒక కళే. దీని పేరు 'షాడో ఆర్ట్'. ఇంట్లో కరెంటు పోయినప్పుడు కొవ్వొత్తి వెలుగులో చేతులతో రకరకాల నీడ బొమ్మలు చేసి మురిసిపోతుంటాం. దానికి కొంచెం సృజనాత్మకతను జోడించి చెత్తను, డబ్బాలను ఉపయోగించి నీడలో మనుషుల బొమ్మలను సృష్టించడం, ముగ్గురు కలిసి వివిధ భంగిమల్లో నిల్చొని ఒక ఆకృతి వచ్చేలా చేయడం ఈ నీడ కళల్లో కొన్ని. సృజనాత్మకతతో పాటు 'నీడ వేరు, నిజం వేరు.. జాగ్రత్త సోదరా!' అనే సందేశాన్ని కూడా ఇస్తున్నట్లు ఉన్నాయి కదూ ఈ బొమ్మలు!









మోహన్ వారి

# శ్రీకేదారేశ్వరవ్రతం




ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక
విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్
FB@mohanpublications
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533 101.
Mohanpublications.com

# కేదారేశ్వర వ్రతము

శ్రీ మహాగణాధిపతయే నమః

ఆచమ్య! ఆచమనంచేసి గణపతిని ప్రార్థించి, విజయ శ్లోక సప్త శ్లోకాన్ని పఠించి భూతోచ్ఛాటనముగావించి ప్రాణాయామంచేసి సంకల్పమును చెప్పుకొనవలయును. సంకల్ప మందలి మూడవభాగము ఈ క్రింది విధముగా మార్చి చెప్పుకొనవలయును.

వర్షేవర్షేప్రయుక్తాం కేదారేశ్వర దేవతాముద్దిస్య కేదారేశ్వర దేవతా ప్రీత్యర్థం స్కాంద పురాణోక్త కల్పోక్త ప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యేః

**అనిచెప్పి పంచపాత్రయందలి నీరుతాకవలయును. తరువాత గణపతి పూజచేసి అవన నివేదనము చెల్లించి కలశపూజ, ప్రాణప్రతిష్టలు గావించి పూజను ప్రారంభించవలయును.**

## కేదారేశ్వరపూజా ప్రారంభము

శ్లో॥ శూలం దమరుకం చైవ దధానంహస్తయుగ్మకే
కేదారదేశమీశానం ధ్యాయే త్రిపురఘాతినమ్. ॥శ్రీ కేదారేశ్వర ధ్యాయామి॥

శ్లో॥ కైలాసశిఖరే రమ్యే పార్వత్యా సహితప్రభో
అగచ్ఛ దేవదేవేశ మద్భక్త్యా చన్ద్రశేఖర కేదారేశ్వరమావాహయామి.

శ్లో॥ సురాసురశిరోరత్న ప్రదీపితపదామ్బుజ
కేదారదేవ మద్దత్తమాసనం ప్రతిగృహ్యతామ్.
కేదారేశ్వరాయ నమః ఆసనం సమర్పయామి

శ్లో॥ గంగాధర నమస్తేస్తు త్రిలోచన వృషధ్వజ
మౌక్తికాసనసంస్థాయ కేదారాయ నమోనమః
శ్రీ కేదారేశ్వరాయ నమః పాద్యం సమర్పయామి

శ్లో॥ అర్ఘ్యం గృహాణ భగవన్ భక్త్యా దత్తం మయేశ్వర
ప్రయచ్ఛ మే మనస్తుష్టిం భక్తానామిష్టదాయకం
శ్రీ కేదారేశ్వరాయ నమః అర్ఘ్యం సమర్పయామి

శ్లో॥ మునిభిర్నారదప్రఖ్యైర్నిత్యమాఖ్యాతవైభవ
కేదారదేవ భగవన్ గృహాణాచమనం విభో
శ్రీ కేదారేశ్వరాయ నమః ఆచమనీయం సమర్పయామి

శ్లో॥ స్నానం పఞ్చామృతైర్దేవ శ్రితం శుద్ధోదకైరపి
గృహాణ గౌరీరమణ త్వద్భక్తేన మయార్పితమ్.
శ్రీ కేదారేశ్వరాయ నమః పంచామృతస్నానం సమర్పయామి

శ్లో॥ నదీజలం సమాయుక్తం మయాదత్తమనుత్తమం
స్నానం స్వీకురు దేవేశ సదాశివ నమోస్తుతే
శ్రీ కేదారేశ్వరాయ నమః స్నానం సమర్పయామి

శ్లో॥ వస్త్రయుగ్మం సదా శుభ్రం మనోహరమిదం శుభం
దదామి దేవదేవేశ భక్త్యేదం ప్రతిగృహ్యతామ్.
శ్రీ కేదారేశ్వరాయ నమః వస్త్రయుగ్మం సమర్పయామి

శ్లో॥ స్వర్ణయజ్ఞోపవీతం చ కాఞ్చనం చోత్తరీయకం
రుద్రాక్షమాలాయా యుక్తం దదామి స్వీకురు ప్రభో
శ్రీ కేదారేశ్వరాయ నమః యజ్ఞోపవీతతోత్తరీయే సమర్పయామి

సమస్తగన్ధ ద్రవ్యాణాం దేవ త్వమసి జన్మభూః
భక్త్యా సమర్పితం ప్రీత్యామయా గన్ధాది గృహ్యతామ్.
కేదారేశ్వరాయ గంధాన్ ధారయామి.
అక్షతోఽ_సి స్వభావేన భక్తానామక్షతం పదం
దదాసి నాథ మద్దత్తైరక్షతైః ప్రీయతాం భవాన్.
కేదారేశాయ అక్షతాన్ సమర్పయామి.
కల్పవృక్షప్రసూనైస్త్వం పూర్వైరభ్యర్చితః సురైః
కుఙ్కుమైః పార్థివై రేభిరిదానీమర్చ్యతే మయా.
కేదారేశ్వరాయ నమః పుష్పాణి పూజయామి.
తతః ఇంద్రాదిలోకపాలపూజాం కుర్యాత్
శివస్య దక్షిణేభాగే (కుడివైపున) బ్రహ్మణే నమః
ఉత్తరభాగే (ఎడమవైపున) విష్ణవే నమః మధ్యే (నడుమ) కేదారేశ్వరాయ నమః

## అథ అంగపూజా

మహేశ్వరాయ నమః పాదౌ పూజయామి
ఈశ్వరాయ నమః జంఘే పూజయామి
కామరూపాయ నమః జానునీ పూజయామి
హరాయ నమః ఊరూ పూజయామి
త్రిపురాన్తకాయ నమః గుహ్యం పూజయామి
భవాయ నమః కటిం పూజయామి
గఙ్గాధరాయ నమః నాభిం పూజయామి
మహాదేవాయ నమః ఉదరం పూజయామి
పశుపతయే నమః హృదయం పూజయామి
పినాకినే నమః హస్తాన్ పూజయామి
శివాయ నమః భుజౌ పూజయామి
శితికంఠాయ నమః కణ్ఠం పూజయామి
విరూపాక్షాయ నమః ముఖం పూజయామి
త్రినేత్రాయ నమః నేత్రాణి పూజయామి
రుద్రాయ నమః లలాటం పూజయామి
శార్వయ నమః శిరః పూజయామి
చన్ద్రమౌళయే నమః మౌళిం పూజయామి
పశుపతయే నమః సర్వాణ్యఙ్గాని పూజయామి

## శ్రీ కేదారేశ్వర అష్టోత్తర శతనామపూజ

ఓం శివాయ నమః
ఓం మహేశ్వరాయ నమః
ఓం శంభవే నమః
ఓం పినాకినే నమః
ఓం శశిశేఖరాయ నమః
ఓం వామదేవాయ నమః
ఓం విరూపాక్షాయ నమః
ఓం కపర్దినే నమః
ఓంనీలలోహితాయ నమః
ఓం శంకరాయ నమః
ఓం శూలపాణయే నమః
ఓం ఖట్వాంగినే నమః
ఓం విష్ణువల్లభాయ నమః
ఓం శిపివిష్టాయ నమః
ఓం అంబికానాథాయ నమః
ఓం శ్రీకంఠాయ నమః
ఓం భక్తవత్సలాయ నమః
ఓం భవాయ నమః
ఓం శర్వాయ నమః
ఓం త్రిలోకేశాయ నమః
ఓం శితికంఠాయనమః
ఓం శివాప్రియాయ నమః
ఓం ఉగ్రాయ నమః
ఓం కపాలినేనమః
ఓం కామారియే నమః
ఓంఅంధకాసురసూదనాయనమః
ఓం గంగాధరాయ నమః
ఓం లలాటాక్షాయ నమః
ఓం కాలకాలాయ నమః
ఓం కృపానిధయే నమః
ఓంభీమాయ నమః
ఓం పరశుహస్తాయనమః
ఓం మృగపాణయే నమః
ఓం జటాధరాయ నమః
ఓం కైలాసవాసినే నమః
ఓం కవచినే నమః
ఓం కఠోరాయ నమః
ఓం త్రిపురాంతకాయనమః
ఓం వృషాంకాయనమః
ఓం వృషభారూఢాయ నమః
ఓం భస్మోద్ధూళితవిగ్రహాయనమః
ఓం సామప్రియాయనమః
ఓం సర్వమయాయ నమః
ఓం త్రయామూర్తయే నమః
ఓం అనీశ్వరాయ నమః
ఓం సర్వజ్ఞాయ నమః
ఓం పరమాత్మనేనమః
ఓం సోమసూర్యాగ్నిలోచనాయనమః
ఓం హవిషే నమః
ఓం యజ్ఞమయాయనమః
ఓం సోమాయ నమః
ఓం పంచవక్త్రాయనమః
ఓం సదాశివాయ నమః
ఓం విశ్వేశ్వరాయ నమః
ఓం వీరభద్రాయ నమః
ఓం గణనాథాయనమః
ఓం ప్రజాపతయే నమః

ఓం హిరణ్యరేతసే నమః
ఓం దుర్ధర్షాయ నమః
ఓం గిరీశాయ నమః
ఓం అనఘాయ నమః
ఓం భుజంగభూషణాయనమః
ఓం భర్గాయ నమః
ఓం గిరిధన్వనే నమః
ఓం గిరి ప్రియాయ నమః
ఓం కృత్తివాససే నమః
ఓం పురారాతయే నమః
ఓం భగవతే నమః
ఓం ప్రమథాధిపాయనమః
ఓం మృత్యుంజయాయ నమః
ఓం సూక్ష్మతనవే నమః
ఓం జగద్వ్యాపినే నమః
ఓం జగద్గురవే నమః
ఓం వ్యోమకేశాయ నమః
ఓం మహాసేనజనకాయనమః
ఓం చారువిక్రయాయనమః
ఓం రుద్రాయనమః
ఓం భూతపతయే నమః
ఓం స్థాణవే నమః
ఓం అహిర్బుధ్న్యాయ నమః
ఓం దిగంబరాయ నమః
ఓం అష్టమూర్తయే నమః
ఓం అనేకాత్మనేనమః
ఓం సాత్త్వికాయ నమః
ఓం శుద్ధవిగ్రహాయ నమః
ఓం శాశ్వతాయ నమః
ఓం ఖండపరశవే నమః
ఓం అజాయ నమః
ఓం పాశవిమోచకాయనమః
ఓం సామ్బాయ
ఓం మృడాయ నమః
ఓం పశుపతయే నమః
ఓం దేవాయ నమః
ఓం మహాదేవాయనమః
ఓం అవ్యయాయ నమః
ఓం హరయే నమః
ఓం పూషదంతభిదే నమః
ఓం అవ్యగ్రాయ నమః
ఓం దక్షాధ్వరహరాయనమః
ఓం హరాయ నమః
ఓం భగనేత్రభిదే నమః
ఓం అవ్యక్తాయ నమః
ఓం సహస్రాక్షాయ నమః
ఓం సహస్రపాదే నమః
ఓం త్రివర్గప్రదాయ నమః
ఓం అనంతాయ నమః
ఓం తారకాయ నమః
ఓం పరమేశ్వరాయ నమః
ఓం కేదారేశ్వరాయ నమః

నానావిధ పరిమళ పుష్పాణి సమర్పయామి.

## అథతోరగ్రన్థిపూజా

శివాయ నమః ప్రథమగ్రన్థిం పూజయామి వాహాయ నమః ద్వితీయగ్రన్థిం పూజయామి మహాదేవాయ నమః తృతీయగ్రన్థిం పూజయామి వృషభధ్వజాయ నమః చతుర్థగ్రన్థిం పూజయామి గౌరీశాయ నమః పఞ్చమగ్రన్థిం పూజయామి రుద్రాయనమః షష్ఠగ్రన్థిం పూజయామి పశుపతయే నమః సప్తమగ్రన్థిం పూజయామి భీమాయనమః అష్టమగ్రన్థిం పూజయామి త్ర్యమ్బకాయ నమః నవమగ్రన్థిం పూజయామి నీలలోహితాయనమః దశమగ్రన్థిం పూజయామి హరాయ నమః ఏకాదశగ్రన్థిం పూజయామి స్మరహరాయనమః ద్వాదశగ్రన్థిం పూజయామి భవాయ నమః త్రయోదశగ్రన్థిం పూజయామి శంభవేనమః చతుర్దశ గ్రన్థిం పూజయామి శర్వాయ నమః పఞ్చదశగ్రన్థిం పూజయామి సదాశివాయ నమః షోడశగ్రన్థిం పూజయామి ఈశ్వరాయ నమః సప్తదశగ్రన్థిం పూజయామి ఉగ్రాయనమః అష్టాదశగ్రన్థిం పూజయామి శ్రీకణ్ఠాయ నమః ఏకోనవింశతి గ్రన్థిం పూజయామి నీలకణ్ఠాయ నమః వింశతి గ్రన్థిం పూజయామి కేదారేశ్వరాయ నమః ఏకవింశతితమ గ్రన్థిం పూజయామి కేదారేశాయ నమః నానావిధ పరిమళపుష్పాణి సమర్పయామి.

దశాఙ్గధూపముఖ్యశ్చ హ్యఙ్గారవినివేశితః
ధూపః సగుంధైరుత్పన్నః త్వాం ప్రీణయతు శఙ్కర.
కేదారేశాయ నమః ధూపమాఘ్రాపయామి.

యోగినాం హృదయేష్వేవ జ్ఞానదీపాఙ్కురో హ్యసి
బాహ్యదీపో మయా దత్తః గృహ్యతాం భక్తగౌరవాత్
కేదారేశ్వరాయ నమః దీపం దర్శయామి.

త్రైలోక్యమపి నైవేద్యం న తే తృప్తిస్తథా బహిః
నైవేద్యం భక్తవాత్సాల్యాద్గృహ్యతాం త్ర్యమ్బక త్వయా.
కేదారేశ్వరాయ మహానైవేద్యం సమర్పయామి.

నిత్యానందస్వరూపస్త్వం యోగిహృత్కమలే స్థితః
గౌరీశ భక్త్యా మద్దత్తం తామ్బూలం ప్రతిగృహ్యతామ్.
కేదారేశ్వరాయ నమః తాంబూలం సమర్పయామి.

అర్ఘ్యం గృహాన భగవన్ భక్త్యా దత్తం మహేశ్వర
ప్రయచ్ఛ మే మనస్తుష్టిం భక్తానామిష్టదాయక.
కేదారేశ్వరాయనమః అర్ఘ్యం సమర్పయామి.
దేవేశ చన్ద్ర సఙ్కాశం జ్యోతిః సూర్యమివోదితం
భక్త్యా దాస్యామి కర్పూరనీరాజనమిదం శివ.
కేదారేశ్వరాయ నమః కర్పూరనీరాజనం దర్శయామి.
భూతేశ భువనాధీశ సర్వదేవాది పూజిత
ప్రదక్షిణం కోరమి త్వాం వ్రతం మే సఫలం కురు.
కేదారేశ్వరాయ ప్రదక్షిణం సమర్పయామి.
హరశమ్భో మహాదేవ విశ్వేశామరవల్లభ
శివ శఙ్కర సర్వాత్మన్ నీలకణ్ఠ నమోఽస్తుతే
కేదారేశ్వరాయ నమస్కారాన్ సమర్పయామి.

**ప్రార్థన**



అభీష్టసిద్ధిం కురు మే శివావ్యయ మహేశ్వర
భక్తానామిష్టదానార్థం మూర్తీకృతకళేభర.

**తోరము తీసుకొనునప్పుడు పఠించు మంత్రము**

కేదార దేవదేవేశ భగవన్నమ్బికాపతే
ఏకవింశద్దినే తస్మిన్ సూత్రం గృహ్ణామ్యహం ప్రభో.

**తోరము కట్టుకొనుటకు పఠించు మంత్రము**

ఆయుశ్చ విద్యాం చ తథా సుఖం చ సౌభాగ్య సమృద్ధిం కురు దేవ దేవ
సంసార ఘోరామ్బునిధౌ నిమగ్నం మాం రక్ష కేదార నమో నమస్తే.

**వాయనము ఇచ్చునప్పుడు పఠించునది**

కేదారః ప్రతిగృహ్ణాతు కేదారో వై దదాతి చ
కేదారస్తారకోభాభ్యాం కేదారాయ నమోనమః



**కేదార ప్రతిమాదాన మంత్రము**

కేదార ప్రతిమా యస్మాద్రాజ్య సౌభాగ్యవర్ధినీ
తస్మాదస్యాః ప్రదానేన మామాస్తు శ్రీరచఞ్చలా.
యస్య స్మృత్యా చ...పరిపూర్ణం తదస్తుతే.
కల్పోక్త విధానేన కృతయా అనయా పూజయా
కేదారేశ్వరః సుప్రీతః సుప్రసన్నో వరదోభవతు.
మమ ఇష్టకామ్యార్థ సిద్ధిరస్తు.

-పూజావిధానము సంపూర్ణము

# కేదారేశ్వర వ్రతకథ

సూతపౌరాణికుడు శౌనకాది మహామునులను చూచి యిట్లనియె. ఓ మును లారా! ప్రపంచమంతయు నెవ్వని యనుగ్రహముచేత సృజింపబడినదో, అట్టి భగవం తుని పార్వతీశ్వరుని నమస్కరించి, సకల సంపదలును నొసగునట్టిదియు, తొల్లి యనేక మునులచే నాచరింపబడినదియునైన కేదారవ్రతము యొక్క మహిమను లోకముల క్షేమాభివృద్ధి గోరి చెప్పుచున్నాను వినుడు. తొల్లి పార్వతీదేవి యీ వ్రతము నాచరించి, సకల సంపదలను బొందెను. ఈ వ్రతంబు నాచరించినవారికిని, ఈ వ్రతమహిమవిన్న వారికిని ఆయురారోగ్య సంపత్కీర్తులు గలుగుచున్నవి. ఈ యుత్తమ వ్రతంబు నే మానవుడరువదియొక్క పర్యాయములు చేయుచున్నాడో వాడు ఇహంబున గొప్ప అదృష్టమును, కాంతిని, ఆయుస్సును కలవాడై యుండి, పరలోకంబున శివ సాయుజ్యము నొందుచున్నాడు. కావున నాలుగు వర్ణంబుల వారును నియమముతో గూడినవాడై ఈ వ్రతంబు నాచరింపవలయును.

వ్రతకథా క్రమంబెట్లనిన :

భూలోకంబున ఈశాన్యమూలయందు కైలాసంబనెడి పర్వతం బొక్కటికలదు. ఆ పర్వతంబున మెఱుపులతోగూడిన శరత్కాల మేఘంబులో యనదగి సకల రత్నములతో గూడిన తెల్లని వెండి శిఖరములు వెలుగుచుండును. సాలతమాలహింతాల వకుళాశోక కరకనికబచందన దేవదారు పనసామ్రపూగపున్నాగ చంపక ప్రముఖ నానావిధ పుష్పఫల భరిత వృక్షములతోగూడి, పలు తెఱంగులగుపులుగులకూత లును, పలువిధంబులగు సెలయేళ్లను గలిగియుండును. యోగులెల్లరు నా పర్వత శిఖరమున నుందురు. అచ్చటనే యక్షకిన్నర గంధర్వసిద్ధ చారణవిద్యాధరులు వాసము చేయుచుందురు. ఆ రమ్యమైన పర్వత శ్రేష్ఠమున సర్వవ్యాపి యగు పరమశివుడు ప్రమథగణంబులు చుట్టు గొల్వు గొల్చుచుండగా పార్వతీసమేతుడై, దేవతల కందఱకు దర్శనం బొసగెను. అప్పుడు అగ్ని వాయు సూర్యచంద్రాదులగు సకల దేవతలను, వసిష్టుడు మొదలగు సకల ఋషులును, బ్రాహ్మి మొదలను అష్టసిద్ధులును, రంభ, తిలోత్తమ, మేనక మొదలగు దేవకాంతలును, చండిక మొదలగు సప్తమాతలును, వినాయకుడును, కుమారస్వామియు, నందుడు మొదలగు ప్రమథగణంబులును సారూప్యము నొందియుండిరి. అప్పుడాసభయందు పరమేశ్వరుని ప్రేరణంబున నారదుడు మొదలగు ఋషులు గానంబుచేసిరి. ఆ ఋషులు సకల శ్రావ్యముగా గానంబుచేయు చుండగా, వారి గానములకు దగినట్లు వాద్యముల వాయించుచు, తాళములు వేయుచు, రంభాదులగు అప్సరసలు నాట్యంబు సల్పిరి.

వారందఱిలోపల గడుచక్కనిదైన రంభ మిక్కిలి వినోదముగా నాట్యము సల్పి యీశ్వరునికి పరమసంతోషమును గలిగించెను. అప్పుడు భృంగిరిటి యను ప్రమ థుడు శివుని యనుమతి వడసి, యప్పరమశివునికిని, సకల దేవతలకును నవ్వు పుట్టునట్లు పార్వతీపరమశివుల ముందట హాస్యము చేసెను. ఆ హాస్యమును చూచి దేవతలందరు పర్వతగుహలు మారుమ్రోగునట్లు కడుపులుబ్బునట్లు నవ్విరి. ఆ ప్రహసనము ముగిసిన తర్వాత పరమశివుడు తన భక్తుని జూచి, ఓ భృంగిరిటీ! బాగుగా హాస్యము చేసితివి. నీ ప్రవాహసనమునకు మిక్కిలి యానందించితినని యా భృంగిరిటిపై మిక్కిలి ప్రేమగల వాడయ్యెను. అంతట నా భృంగిరిటి శివుని యొక్కయు, దేవతలయొక్కయు మన్ననవలను బడిసి, పార్వతీ దేవిని విడిచి, పరమ శివునికి మాత్రము ప్రదక్షిణము గావించి నమస్కరించెను. అప్పుడు పార్వతి తన నాథునిజూచి యా భృంగిరిటి నన్నువదలిపెట్టి నీకుమాత్రము ప్రదక్షి ణంబు గావించి నాడందుకేమి కారణం''బని యడుగగా శశిశేఖరుడును "ఓప్రియా! బ్రహ్మము నెరిగిన యోగులు నిన్నుమ్రొక్కరు. వారికి నీవలనపనిలేదు. అనిపార్వతికి జెప్పెను.

ఇట్లు పరమశివుడు చెప్పగా పార్వతి తన ప్రియుని మీది కోపముచే అతనిని బాసి తనశక్తి నాకర్షింపగా, పరమేశ్వరుడును ప్రియావియోగముచే జిక్కిపోయెను. అంబికయు ప్రియవియోగముచే మిక్కిలిచిక్కి, దేవతలు వేడుకొనుచున్నాను, శాంతి నొందక కైలాసము విడిచి, యొండొంటి మీద పగలేని సింహవ్యాఘ్ర మృగంబులతో గూడినదియు, మహర్షుల కునికిపట్టును,జనుల కందఱకు బ్రీతికరమై యన్ని కోర్కెల నొసగునదియునైన గౌతమ వనంబునకు బోయి చేరెను. ఎక్కువ బ్రహ్మతేజస్సుగల గౌతమమహాముని వనంబున బెరుగు హోమయోగ్యములగు సమిధలను, దర్భలను బండ్లను గైకొని వచ్చుటకై వనాంతర ములకు బోయియుండెను. తర్వాత నమ్మహర్షి కావలసిన వస్తువులను గైకొని మరలి, తన యాశ్రమము చేరువకువచ్చి, "ఏమి యీవింత? ఈ తపస్సుల యాశ్రమంబు అకాలమున మిక్కిలి శోభిల్లుచున్నది. కారణమేమైయుండవచ్చును'' అని యాలోచించుచు, తపో వనంబులోపల ప్రవేశించి, కమలంబులంబోలు కన్నులుగల పార్వతింజూచి యతిథిపూజచేసి

యాగమనకారణం బేమని పార్వతీదేవి నడిగెను. ఆ పార్వతి తన విచారంబునకు గారణం బెరింగించి యాతనిని, గూర్చుండజేసి "ఓ భగవంతుడా! సకలయోగులు పూజించెడి యీశ్వ రుని యర్థాంగము నాకెట్లు సిద్ధించునో, అట్టి వ్రతమొక్కటి యానతి''మ్మని యడిగెను. అంతట గౌతమమహాముని సకల శాస్త్రములను పురాణములను బరికించి, "కోరిన కోర్కెల నొసగు కేదారేశ్వరవ్రతంబు నాచరింపుము. నీకోరిక సిద్ధించునని చెప్పెను. ఆ పార్వతి ముని పలుకులు విని, "ఓమహాత్మా! ఆవ్రతంబు సేయుట యెట్లు? శాస్త్రవిధానంబు నెఱిం గింపుము.''అని యడుగగా, నాగౌతమ మునీంద్రుడాపార్వతీ దేవి కిట్లనెను. ఆశ్వయుజ శుద్ధఅష్టమినాడు మానవుడు పరిశుద్ధుడై తెల్లపట్టువి కాని లేక నూలు పోగువికాని యిరువది యొక్క పేటల నూలిని జేతికి కంకణము కట్టుకొనవలయును. ఆ రాత్రి యుపవాసముండి బ్రాహ్మణ భోజనంబు చేయింపవలెను. అదిమొదలమావాస్యవరకు ప్రతిదినమును కేదార నాథుని పూజచేయవలయును.

ఆ వ్రతంబు సేయువిధంబెట్లనిన, ప్రతిదినముదయమున లేచి పరిశుద్ధమై విజమై యుండు స్థలంబున ధ్యానమును రాశిపోసి దానిమీద నొక పూర్ణకుంభము నుంచి, దాని నిరువదియొక నూలిపోగులతో జుట్టి దానిమీద తెల్లనిబబట్టు బట్టగాని, లేక మరేవస్త్రమును గాని చుట్టి, నవరత్నములనుగాని, బంగారమునుగాని,వెండిని గాని దానియందుంచి, గంధ పుష్పాక్షతాదులతో నాకలశంబును పూజించి, యావల నిరువది యొక్కమంది బ్రాహ్మణు లను బిలిచి, కాళ్లు కడిగి పీటలమీద గూర్చుండబెట్టి, పురోహితునికి ముందుగా పూజచేసి, పిమ్మట నాయిరువదియొక్క మంది బ్రాహ్మణు లను పూజింపవలెను. తర్వాత కలశము నందు కేదారదేవుని నావాహనముచేసి, చందనాగరు కర్పూర కస్తూరీ కుంకుమాదులతోను, గంధపుష్ప అక్షతలతోను, నానావిధవస్త్రములతోను పూజించి, ధూపదీంబులొసగి, గోధుమ పిండితోజేసి నేతిలో గాల్చిన యిరువది యొక్క యతిరసములను, పాయసమును, పాలు, పెరుగు, నెయ్యి, తేనె మొదలగువానితో నిండిన సకల విధశాకంబులను, పలుతెఱంగులైన యరటి మామిడి కిచ్చిలి మొదలగు పండ్లను నివేదనచేసి, తాంబూలనీరాజన మంత్రపుష్పము లొసగి వ్రతంబు పూర్తిచేసి యా కేదారేశ్వరుని సంతోషపెట్టుము. అంతట పరమేశుడు వేల్పులందరితో గూడవచ్చి నీకు స్వదేహములో నర్థాంశము నొసగు నని చెప్పెను.

అంతట పార్వతి మునీంద్రుడు చెప్పిన చొప్పున బహుభక్తితో నాకేదారేశ్వర వ్రతంబు నాచరించెదను. తర్వాత భగవంతుడగు వృషధ్వజుడు వేల్పుగుములతోడ ప్రత్యక్షమై పార్వతికి తన దేహములో సగముభాగము నొసగెను. తర్వాత పార్వతి మిక్కిలి సంతోషపడి, యీశ్వరుని యర్ధశరీరమునుబొంది, లోకులు మేలుగోరి యీశ్వరుని సంతోష పరచి కేదారేశ్వరుని యనుగ్రహంబువలన గోరిన కోర్కెలెల్ల భక్తుల కొసగునట్లు వరంబుగోరెను. పరమేశ్వరుడును అట్లే కలుగునుగాక యని అనుగ్రహించి, వేల్పులందరితోగూడి యంతర్ధానము నొందెను. అప్పుడచ్చట నుండిన శివభక్తుడయిన చిత్రాంగదుడను గంధర్వుడు నందికేశ్వరుని యను గ్రహము బడసినవాడై తాను భూలోకంబున నీ త్రంబును ప్రచారంబు చేయనెంచిన వాడై యుజ్జయినీ పట్టణమునకు వచ్చి "ఓనాథా! కేదారనాథ వ్రతంబు సల్పితివేని, నీకు సకలసంపదలు గలుగు''నని వద్రంతుడను యుజ్జయినీదేశపురాజున కెఱింగించెను. ఆ వజ్రదంతుడీ వ్రతంబు నాచరించి దేశములకెల్ల ప్రభువాయెను. ఆ పట్టణమున నిద్దరు వైశ్యకన్యక లుండిరి. వారు తమ తండ్రికడకువచ్చి నాయనా! మేము కేదారేశ్వర వ్రతంబుసేయ నెంచియున్నాము. మా కానతిమ్మని యడిగిరి. వానికి, తండ్రి, పిల్ల లారా! నేను దరిద్రుడను, మీరాతలంపు మానుకొండు అని చెప్పెను. అంత నా కన్యకలు "నాయనా! నీవేమి యియ్యనక్కరలేదు. నీ వుత్తరువిచ్చిన యెడల జాలును" అని యడిగిరి. ఆ ప్రకారమే తండ్రి యుత్తరవిచ్చెను. తర్వాత వారి భక్తికిమెచ్చి, ఈశ్వరుడు తానే వారికి గావలసిన

వస్తువులు దొరకునట్లు ప్రసాదించెను. అంత వారలిద్దరు నొక మఱ్ఱిచెట్టు క్రిందికిపోయి మొదట కంకణము కట్టుకొని యీ వ్రతంబును యథావిధిగా నాచరించిరి. అంతట మహాదేవుడు కడునుప్పొంగి, వారికి సురూపంబును, దీర్ఘజీవితంబును,తరుగని కలిమిని నొసగి యంతర్ధానమునొందెను. ఆ యిద్దరక్కసెల్లెండ్రలో పెద్దదగు పుణ్యావతి నుజ్జయినీరాజు పెండ్లాడెను. మరొక్కతె యగుభాగ్యవతిని చోళదేశపురాజు పెండ్లాడెను. ఆ వైశ్యుడును తన కొమార్తెలను రాజుల కిచ్చుటచే మిక్కిలి కలిమినొంది సుఖంబుండెను. ఆ యిద్దఱు వైశ్యపుత్రికలును సామ్రాజ్యమును సంపదను మహాబలులగు కొడుకులను బడసి సుఖంబుండిరి. తర్వాత గొంతకాలమునకు భాగ్యవతి యైశ్వర్యమదముచే మై మరచినదై, యా కేదారేశ్వర వ్రతంబు నుల్లంఘనము చేసెను. అది కారణంబుగా నాభాగ్యవతిని కొడుకుతో గూడ దానిభర్త యొకకారణంబుచే రాజ్యమునుండి తరిమెను.

అంతట నా భాగ్యవతి తనపిల్ల వానితోడ నడవులెల్ల దిరిగి మిగులడస్సి, కడపట నొకబోయవాని యిల్లుజేరి, తన కొడుకును బిలిచి, "నాయనా! యీ యుజ్జయినీ రాజుభాగ్య నాకక్క గావలెను. కావున బెత్తల్లి కడకుబోయి , మనసంగతి యెఱిగించి, ధనము గొనిరమ్మని చెప్పిపంపెను. ఆ బాలుడును ఉజ్జయినికేగి తనపెత్తల్లి యగు పుణ్యావతికి తనతల్లి రాజ్యము నుండి తరుమగొట్టబడి యడవులం దిడుమలపడుచుండుట చెప్పి యామె యిచ్చిన విస్తార ధనంబును గైకొనివచ్చు చుండెను. దారిలో కేదారేశ్వరుడు దొంగవలెవచ్చి యాధనము నపహరించుకొని పోయెను. మరల నబ్బాలుడు వెనుకకు బోయి, తాపడిన తంటాలుచెప్పి, మరల సొమ్ము గొనివచ్చుచుండగా కేదారేశ్వరుడు ముందటివలె నతనికి గనబడకవచ్చి సొమ్ము దోచుకొని, దీనుడైన యాబాలుని జూచి "ఓభాగ్యవతీ పుత్రుడా! వ్యసనంబు నొందకుము. నా వ్రతంబు నుల్లంఘించిన వారికీధనంబు దగతు అని చెప్పెను. అంత నాబాలుడు, పుణ్యావతి కీవృత్తాంతంబును జెప్పెను. అంతట పుణ్యావతి యా బాలునిచే నా వ్రతంబు చేయించి, అబ్బాయీ! తల్లిచేత నీ నోము నోమించుమని చెప్పి వానికి గావలసిన ధనం బొసగి పంపెను.

అంతట నా బాలుడాధనంబును గైకొనివచ్చుచుండగా, ముందు దానుబోగొట్టిన ధనమంతయు దారిలో బడియుండెను. ఆ బాలుడాధనంబునుగూడ దీసికొని, తల్లి కడకు వచ్చి, జరిగినసంగతియెల్ల నామెతో జెప్పెను ఆ భాగ్యవతియు దానుల్లఘనము చేసియుండిన కేదారవ్రతంబును మరల భక్తితో జేసి, తన తప్పిదమును క్షమింప కేదారనాథుని వేడెను. తర్వాత నాబాలుడు కేదారనాథుడు యనుగ్రహమువలన జతురంగబలముతో గూడినవాడై కాంచీపురంబునకు రాగా, చోళరాజగు తన తండ్రి యెదురేగి వారిని బిల్చుకవచ్చి, బహుకాలము పెంపొందుచుండెను.

అది మొదలు భాగ్యవతియు, చోళరాజును ఆ వ్రతంబును జేయుచు సకల సంపదలతో నిండి రాజ్యపరిపాలనము చేయుచుండిరి. ఈ వ్రతంబు గౌతమ మునీంద్రుడు పార్వతి కుపదేశించినది గనుక నిహపరసుఖము గోరు మానవుడీ వ్రతంబును జేసెనేని యిహమున సకలాభీష్టమును బొంది, యనంతరమున పరమశివుని సాయుజ్యమును బొందును. ఈ వ్రతమహిమ విన్నవారికిని చదివిన వారికిని మహా దేవుడు సర్వసంపదల ననుగ్రహించును. ఇది స్కాందపురాణోక్త కేదార వ్రతకథ సంపూర్ణము.

**మృత్యుంజయ మహామంత్రం**

**ఓం త్ర్యంబకం యజామహే**
**సుగంధిం పుష్టివర్ధనం ।**
**ఉర్వారుకమివ బంధనాత్**
**మృత్యోర్ముక్షీయ మాఽమృతాత్॥**

**శివ - రుద్ర గాయత్రీ**

**గౌరీనాథాయ విద్మహే సదాశివాయ ధీమహి**
**తన్నశ్శివః ప్రచోదయాత్॥**
**తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి**
**తన్నో రుద్రః ప్రచోదయాత్॥**

